శ్రీ రామవిలాసగ్రంథమాల 12.

శ్రీ చెలికాని లచ్చారావుగారు;
(సంపాదకులు.)

# హర్షచరిత్రము.

## ప్రథమభాగము.

బ్రహ్మశ్రీ శతావధానులగు,
తిరుపతి వేంకటేశ్వరకవులు.

శ్రీరామవిలాసగ్రంథమాల 12.

శ్రీ ర స్తు.

# హా ర్ష చ రి త్ర ము.

## ప్ర థ మ భా గ ము.

ఇ ది

బాణకవి విరచిత సంస్కృతమునుండి

బ్రహ్మశ్రీ శతావధానులు,

తి రు ప తి వేం క టే శ్వ ర క వు ల చే

నాంధ్రీకరింపఁబడి

శ్రీ చె లి కా ని ల చ్చా రా వు గా రి చే

సంపాదింపఁబడినది.



చె న్న ప ట్ట ణ ము :

శ్రీ రా మ వి లా స ము ద్రా క్ష ర శా ల,

1920.

వె ల రు 0—8—0.

# సంపాదకీయ భూమిక.

——:0:——

'నిశ్వాసోపి ననిర్యాతి బాణే హృదయవర్తిని' అనియు 'బాణోచ్ఛిష్టం జగత్సర్వ' మ్మనియు కొనియాడఁబడిన శ్రీమహాకవి బాణభట్టునిచే రచింపఁబడిన లోకోత్తరంబులగు గద్యకావ్యములు । కాదంబరి శ్రీ హర్షచరిత్రము సంస్కృతంబున మిగులఁ బొగడ్తఁగన్నవి. అవి రెంటినిఁ దెలుఁగున రచియింపఁజేసి ప్రచురింపవలయునని నాకుఁ జిరకాలమునుండి మనోరథము కలదు. అందు శ్రీసత్యవోలు సోమసుందరకవిగారిచే నాంధ్రీకృతంబగు కాదంబరి నాకులభించినది. అది నాచేఁ బ్రచురింపఁబడు " ఆంధ్రభాషావిలాసిని " యను తెలుఁగు మాసపత్రికయందుఁ బ్రకటించుచున్నాను. ఇఁక శ్రీ తిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతంబగు హర్షచరిత్ర కొంతవఱకు లేటు పోలవరం జమీందారుగారిచేఁ బ్రకటింపఁబడిన సరస్వతియందుఁ బ్రచురింపఁబడి ఆగిపోయినది. దానిని సంపూర్తిగాఁ బ్రచురింపఁదలఁచి వారివలన తద్గ్రంథముసంపాదించి యందలి బాణభట్టారక చరిత్ర ప్రథమభాగమను పేరితో మా శ్రీరామవిలాసగ్రంథమాలకు పాయనముగాఁ బంపుచున్నాను.

ఇందలికథ పూర్వకాలంబున విధాత సత్యలోకంబునఁ బద్మాసనంబునఁ గూర్చుండి దేవేంద్రప్రభృతులగు దేవతలకుఁ బరబ్రహ్మవిషయంబులగు కథలుఁ జెప్పుచు వారితో నిరవద్యంబులగు నితరవిద్యాప్రసంగంబులుచేయుచు కాలంబుఁ గడుపుచుండెను. ఋషిపుంగవులును నెవటికిఁదగినట్లువారు విద్యాగోష్ఠిచేయుచుండెడివారు. ఇట్లుండ నొకనాఁడు వారిలోవారికి వివాదములు తటస్థించెను. దూర్వాసమహాఋషి మందపాలుఁడను నిరాచారితోఁ బంతగించి సామగానంబుసేయుతరి స్వరముతప్ప సరస్వతి పరిహసింప దూర్వాసుండు కుపితుండయి నీవు మర్త్యలోకంబునకుఁ బోవుదువుగాక యని శపించెను. పితామహుండు రోషదోషంబును నిగ్రహింపలేని నాతనిని చీవాట్లుపెట్టి సరస్వతినిఁజూచి నీవు భూలోకంబున కుమారుఁగన్నంతవఱకే నీకీశాపముండునని యోదార్చి సావిత్రిఁ దోడిచ్చిపంపెను. సరస్వతి భూలోకంబునఁ దధీచుని వరించి సారస్వతుఁడను పుత్రుఁగని విడిచి బ్రహ్మలోకంబునకుఁ బోయెను. దధీచుండు నాబిడ్డను యక్షమాలికయను మునికన్యకుఁ దనకుమారుఁడగు వత్సునితోఁబాటుఁ బెంచనప్పగించి తపోవనంబున కఱిగెను. పెద్దవాఁడైనతరువాత సారస్వతుఁడును తన తండ్రికడ కేగెను.

వత్సుఁడు పీతికూటమనుఁ బేరుగలచోట నివాసముండెను. వాత్స్యాయనులను పేరుగల వారెల్లరును నాతనివంశీయులే! యావంశంబు క్రమక్రమముగా విద్యాసం
... గుబేరనామధేయుండగు ద్విజోత్తముఁడుదయిం
... శుపతియనువానికి నర్థపతిపొడమె
... చిత్రభానుండనువానికి రాజదేవియ
... క్రీస్తుశక మేడవశతాబ్దమునకుఁ
... చిన్నతనంబున దల్లియు పదు
... తండ్రికి శూద్రస్త్రీయందు జనించిన జంద్రసేన మాతృషేణు లనుతమ్ములు యిరువురితోను గతిపయయౌవనపురుషులతోను గూడి యౌవనారంభమున స్వేచ్ఛావిహారియై దేశసంచారియయ్యెను. తిరిగితిరిగి దుట్టతుదకు పెక్కుమంది రాజుల దర్శించియు విద్యావిభవంబుఁ గాంచియుఁ దన జన్మస్థానం బగుటఁ జేరి బంధుమిత్రులమన్ననలఁ బడయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు మహారాజాధిరాజరాజపరమేశ్వరుండగు శ్రీహర్షదేవునిపంపున సోదరుఁడగు కృష్ణభూపతికడనుండి మేఖలకయనుమాత వచ్చి రాజాజ్ఞాలేఖ నిచ్చెను బాణుం డదితిలకించి హర్షముతో హర్షచక్రవర్తి సన్నిధానమున కేగెను. రాజు దౌవారికుని "ఇతఁడా బాణకవి" అని యడిగియు నాతనిని సన్మానించక దగ్గఱఁగూర్చున్న మాళవరాజపుత్రునితో నీతఁడు మహాభుజంగుఁడు సుమా? యని ప్రస్తావించె. శత్రువులు బాణుండు దుర్మార్గుండని చెప్పినొప్పు బాణుండును కొంతతడవుఁ జూచి కొంతకాలమునకు దేవరకు నాయోగ్యత తెలియఁగలదనియుఁ గరుగఁ బిలువఁగలఁడనియు ననవలసిన మాటలు కొన్ని నిర్బోధకములైనవి పలికి వెడలిపోయెను.

కొలఁదిదినములు గడచినతరువాత యథార్థస్థితి నెఱింగిన హర్షచక్రవర్తి చే పట్టలు సాహసాలుఁడై యుచితసత్కారంబు లందియాలని కీర్తినసస్కృతుఁడై కొన్నాళ్లుండి మిగుల యానందమనుభవించి యాభూపతియొద్ద సెలవుఁ గైకొని నిజగ్రామంబునకు నిర్గమించె తదీయబంధుమిత్రులు రాజానుగ్రహంబు వడసివచ్చిన యాకవివరుంసుని మిగుల యభినందింపఁజొచ్చిరి. బాణుఁడు తద్భవనంబున బంధుమిత్రవర్గంబుతో నాసీనుఁడై యుండ సుదృష్టియనువాఁడు పురాణపఠనంబుఁ గావించుచుండెను. వందు యదివిని యీపురాణము హర్షచరిత్రకంటె భిన్నముగా లేదనిచెప్ప నంగుపై బా... పి తండ్రికొడుకులు వలువురిలో శ్యాముఁడు హర్షరాజు మూలపురుషుఁడు మొదలుగా భార్గవవంశము దెలుపుచు వర్ణించుమని ప్రార్థించినఁ దగు నీబా

ణాని చరిత్ర విన నేటికిఁ గుతూహల మొదవకుండు ? అని వేఁడ బాణుఁడు విని తదను కూలవర్తియై తదీయవంశవర్ణన ముపక్రమింపఁ దొడంగె.

కవులను పేరఁ బెట్టుకొని పిట్టకథలతో నల్లిబిల్లి వ్రాతలు వ్రాయుచుఁ బారమార్థికచింతవదలి ద్రవ్యార్జనమే ప్రధానసాధనముగాఁ గలిగి తామేమో యర్థనుల మైనట్లు శ్లేషచమత్కారంబు లొదవించునట్లు పరదూషణ పరనిందలతోఁ గాలముఁ బుచ్చు వాగాడంబరులవలెఁ గాక విద్వత్కవిశిఖామణులై పండితమాన్యులై పండిత పామరసేవితంబగు నిట్టి సర్వోత్కృష్టగ్రంథంబును లోకోపకారార్థమై రచించి మా గ్రంథమాలా ప్రకటనార్థమై యొసంగిన బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతివేంకట కవులకు మా కృతజ్ఞతా వందనంబు లర్పించుచున్నాఁడ.

2-11-2,
చిత్రాడ.

ఇట్లు
శ్రీ చెలికాని లచ్చారావు.



శ్రీరస్తు.

# హర్షచరిత్రము.

---

## ప్రథమోచ్ఛ్వాసము.

శ్లో॥ విధదాం *కృష్ణభూస్వామీ స నః శ్రీ చతురాననః
విద్వద్వాఙ్మనసరంగేషు రమతే †యత్సరస్వతీ॥

గీ. నలినభూముఖపద్మవనంబునందుఁ, దిరుగు రాయంచపూఁబోఁడి దేవదేవి
సర్వశుక్ల సరస్వతి సర్వకాల, మాడుకొనుఁగాత నాహృదయంబునందు.

గీ. ఉన్నతంబైనతలమీఁదనుంచుకొన్న, చిన్నిజాబిల్లి వీచోపు చెలువు దెలుప
మూఁడు లోకంబు లనుప్రోలు మొదలిడుటకు, శంకువగుశంకరునకు నేఁ గింకరుండ.

గీ. కాలకూటవిషస్పర్శకలిత మూర్ఛ, నదిస నేమొకో యనునట్లు కాలకంఠ
కృతపరిరంభపరవశీకృతగిరీంద్ర, పుత్రి కానందగరిమ నొసంగుఁగాత.

గీ. విద్య లెఱిఁగినప్రోడ కవిత్వమునకుఁ, దాత వ్యాసుండు వాగ్దేవతాపవిత్ర
వర్షముం బోలు నొకమహాభారతంబు, జేసెఁ గావునఁ దన్నమస్కృతి యొనర్తు.

గీ. ప్రతిగృహంబున నిజముగా భషకచయముఁ, బోలెఁ గుకవులు వేలకువేలు గలరు
శరభములు వోలె నెక్కుడో సత్కవీంద్రు, లున్నవారలు వేయికొక్కొక్కరుగను.

గీ. అన్యవర్ణపరావృత్తి యఖిలబంధ, చిహ్ననిహ్నవకును దాను జేయుకతనఁ
జోరుఁ డనఁబడు సత్పురుషులనడుమను, గవి నిజంబుగ దాన నాఖ్యాతుఁ డగుచు.

గీ. ఔత్తరాహులయందు శ్లేషాతిశయము, గలుగుఁ; బాశ్చాత్యులం దర్థగౌరవంబు
గలుగు; నుత్ప్రేక్ష దాక్షిణాత్యులకుఁ గలుగుఁ, గలుగునక్షరడంబంబు గౌడులందు.

గీ. క్రొత్తకల్పన నింద్యమూ చెత్త లేని, జాతి స్ఫుటమైనరసము కష్టంబు గాని
శ్లేష సుకుమారబంధంబు చెలఁగుకృతులు, దుష్కరము లగు నేకవీంద్రులకునైన.

గీ. పెక్కువృత్తాంతములను వ్యాపించుకథయు, సర్వకకుబంతములయందుఁ జదువరులను
లేనికబ్బంబు రచియింపఁబూనుకంటెఁ, గుకవులకుఁ దామూరకొనుట మేలు.

గీ. ఎవ్వరాఖ్యాయికాకర్త లెవరివాక్కు, లందురి సముబ్బమందు సర్గాంతమందు
నబ్బురంబుగ సర్గాదియందుఁ బోలె, వందనీయులు సత్కవీశ్వరులువారు.

---

*కృష్ణభూస్వామీ=కృష్ణభూః=విష్ణువువలనఁ బుట్టిన ; స్వామీ=ప్రభువు, బ్రహ్మ,
కృష్ణభూస్వామీ=కృష్ణరాజను జమీందారుఁడు.

†యత్సరస్వతీ=ఎవని సరస్వతీదేవి. ఎవని సరస్వతీప్రతిక.

గీ. కర్ణగోచరమయినంతఁ♦గవివరులయు, దారగర్వంబు బాణసం♦పత్తి చేత
దళితమయ్యెను బాణసం♦పత్తమయిన, శక్తిచేఁ బాండుపుత్రుల♦సంపద గను.

గీ. లెస్స వర్ణక్రియాచార♦లీల తెలియ, హారియై పదబంధుర♦ఖ్యాతిఁ దెలుఁగు
భట్టహరిచంద్రు గద్యప్ర♦బంధ మరయఁ, గద్యకావ్యంబులకు నెల్లఁ♦గాదె రాజు

గీ. నాగరావృతమయి యవి♦నాశియయిన, కోశమొక్కటి లోకంబు♦కొఱకుఁ జేసె
శాతవాహనకవిరాజు♦జాతిరత్న, గణముచేఁ బోలె మంచివా♦క్యముల చేత.

గీ. ప్రవరసేనుని కీర్తి వా♦రాశిఁ గవలి, యొడ్డునకు దాఁటి చనెఁ గుము♦దోజ్జ్వలంబు
మున్న కుముదోజ్జ్వలంబయి♦యున్న కోఁతి, దండు సేతుపథంబున♦దాఁటినట్లు.

గీ. సూత్రధారుండు మొదలిడఁ♦జోద్య మొదవఁ, దగినభూమికలలర స♦పతాక నెలయ
దేవకులములఁ బోలిన♦దివ్యనాట, కములచేఁ గీర్తిఁ గనె భా♦సకవివరుండు.

గీ. మధురసాపూరితములైన♦మంజరీచ, యంబునం బోలెఁ గాళిదా♦సాస్యనిర్గ
తములగు సూక్తులందాద♦రమ్ము లేని, వార లున్నారె యీధరా♦భాగమందు.

క. గౌరీసంప్రాప్తాలం, కారంబై సంప్రదీప్త♦కందర్ప శుభా
కారం బైన బృహత్కథ, కేరీశ్వరలీలకట్లు♦తెరఁగరు జగతిన్.

గీ. ఆఢ్యరాజకృతుల్ హృద♦యమునఁ బూని, యుంచుకేనియు మరలఁ ద♦లంచి రేని
లాగికొనిపోయినట్లు నా♦లుకఁ గవిత్వ, రచనపైఁ బుట్టఁబో దాద♦రంబు మరల.

ఉ. అంతటిశక్తి గల్గినమ♦హాకవు లున్నను లెక్కసేయ కే
నెంతయు హర్షభూమిపతి♦యందలిభక్తి రచింపుమంచు నో
క్కింత దిటంబుఁ జెప్ప నిటు♦లీ కృతిసేయఁగఁ బూనుకొంటి భీ
తాంతరవృత్తితోనె యస♦హంబగు బాలకచాపలంబునన్.

క. సులలితసువర్ణఘటనో, జ్జ్వలశబ్దసుఖప్రబోధ♦సంపాదనపే
శలములు కావ్యంబులు శ, య్యలపోలిక సౌఖ్యమొసఁగు♦సజ్జనులకిలన్.

గీ. ముఖమునందు ఖేద♦ముం బూనుచుం బ్రతి, పదమునందుఁ ద్రొట్రు♦పడుచు వెడలు
క్రొత్తముద్దరాలి♦కోమటున మిగులఁ గ, ష్టంబుతోనె కథయు♦శయ్యఁ జేరు.

గీ. చాలితస్వపరితాపాగ్ని♦కీలసాల, పాలితాఖిలలోకభూపాలసాళి
గ్రాలు హర్షుండు శ్రీశైల♦లీల సర్వ, జనమనోరథపూర్తిఁ దీ♦క్షాపరుండు.

# కథాప్రారంభము.

---

పూర్వకాలంబున భగవంతుండగు విధాత సత్యలోకంబునఁ బద్మాసనంబునఁ గూర్చుండి దేవేంద్రప్రభృతులగు దేవతలకుఁ బరబ్రహ్మవిషయంబు లగుకథలు వక్కాణించుచు మఱియు వారితో నిరవద్యంబు లగు నితరవిద్యాప్రసంగంబులు చేయుచుఁ గాలంబుఁ గడపుచుండె. అక్కాలంబున మనువు దక్షుఁడు చాక్షుషుఁడు మున్నగు ప్రజాపతులును వసిష్ఠుఁడు మొదలగు ఋషులును ద్రిభువనదర్శనీయుండగు నాపరమేష్ఠిని సేవించుచుండువారు. అందుఁ గొందఱు పొగడికలు నేర్చినవారు ఋక్కులచే నుతింపసాగిరి; పూజావిధాన మెఱిఁగిన మఱికొందఱు యజుస్సులను బఠింపసాగిరి; ప్రశంస తెలిసిన మఱికొందఱు సామగానముఁ గావింపసాగిరి. కర్మిష్ఠు లగు మఱికొందఱు మంత్రంబు లుచ్చరించుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు విద్యాగోష్ఠి చేయుచున్న వారిలో వారికి వివాదము తటస్థించెను.

స్వభావముచేఁ గోపిష్ఠుండును మిగులఁ దపస్వియు నత్రికొడుకును జంద్రునకుఁ దమ్ముండు నగు దుర్వాసుండు మందపాలుఁ డను నిరాంబారితోఁ బంతగించి క్రోధాంధుఁడై సామగానము సేయుతఱి స్వరము తప్పెను. అచ్చోట నున్న లాఁతిజడదారు లెల్ల శపించు నని జడిసి యూరకుండిరి. నలువయు నితరాలాపప్రసంగమున నది తెలిసికొనఁడయ్యె; కొంచెము బాల్యము వదలి యౌవన మంకురించిన వడుచుప్రాయము గలిగి చలద్భ్రూజాలతయయి ప్రియునకుఁ జామరసేవ సేయుచున్న సరస్వతీదేవి సహజారుణంబు లగు పాదపల్లవంబులు స్వరాపరాధి యగు దూర్వాసుని దిరస్కరించుటకును దన్నుటకును బొడమిన యలుకచే నెఱ్ఱవాఱినవో యను నట్లూహింపఁబడఁ బదక్రమముఖరమగు నూపురయుగళం బంతేవాసివ్రతయుమువలె మొఱయుచుండఁ జిక్కులు మదనపురీతోరణస్తంభంబులభాతి భాసిల్ల రాయంచపలుకులవలె రొదసేయు గంటలయొడ్డాణంబుపై వలకేలు గీలుకొలిపి విద్వన్మనోనివాసంబునం దగులుకొనిన గుణనికరంబో యనఁ దనరారు బ్రహ్మసూత్రంబు బుజముపై వ్రేలాడ భాస్వన్మధ్యనాయకంబును ననేకముక్తామయాతంబు నగుటం జేసి యపవర్గమార్గంబుం బురణించు హారం బురంబునం బ్రస్ఫురిల్ల వదనంబునం బ్రవేశించిన విద్యాకాంతల కాలి లత్తుక తగిలి యెఱ్ఱవడెనని యుత్ప్రేక్షింపఁదగిన వాతెఱ యించుక చలింప చెక్కుటద్దంబునం బ్రతిబింబించిన కమలాసనుని కృష్ణాజినము సంగీతశ్రవణాసక్తిచే దిగివచ్చిన చంద్రబింబములోని కురంగమనుభ్రాంతి కలిగింప నడ్డముగాఁ దిరస్కారభావముతో నొక కనుబొమ్మ యెత్తి క్రీఁగన్నులనుండి వెడలు కటాక్షజలప్రవాహంబుచే నపస్వరశ్రవణకలుషితం బగు

నొక చెవిని బరిశుద్ధము సేయుచు వికసితసింధువారమంజరీసమలంకృతంబయి నవ్వుచున్నదో యనఁ దనరారు లాఁతిచెవిచే విద్యామదము ప్రకటించుచుఁ గర్ణపూరకుసుమంబులయందలి మధుకరకులంబులు శ్రుతిప్రణయంబు లగుటంజేసి యుపాసింపఁ బ్రజ్ఞాపతాకవలెఁ బ్రకాశించు సన్నని తెలివలిపెంబు శరీరము నిండఁ గప్పుకొనుచు నిర్మలంబగు వాచాప్రపంచము వలె దంతకాంతి దశదిక్కులు నిండఁ బరిహసించెను.

ఇట్లు నవ్వినసరస్వతం జూచి యా దుర్వాసుం "ఓసీ! పాపాత్మురాల! అతిప్రమాదము చేసియాశ్రయించిన యింతకవిద్యాకలననే గర్వితురాలవయి దుష్పాండిత్యముఁ జూపుచు నన్ను నుఱితము పరిహసించుచున్నావా!" యని కోపపువట్టి నచ్చని రంగుగల జడలు తలపంకించుటంజేసి ముడి సడలి జీరువారఁ దత్కాంతి రోషాగ్నిద్రవముం బోలి దశదిక్కులకుం బ్రవహింపనంతకాంతిస్ఫురగండస్థలముకరక యగుభృకుటిచే బంగారము వంటి ఫాలభాగ మెల్ల నల్లవాఱఁ గోపదేవతకుఁ గానుకగా నెత్తురు నివేదించుచున్నట్లు కన్నుల నిండ జేగురురంగు గుబుక నొడుగులఁబి దంతకాంతిమిషంబున భయపలాయమాన యగు వాగ్దేవత నరకట్టుచు మాటిమాటికి బుజమునుండి జాఱిపోవు కృష్ణాజినమును శాపశాపనపత్రికను బోలె ముడివైచుచుఁ జెమటబిందువులయందుఁ బ్రతిఫలించిన సురాసురమునీశ్వరకోటి భయముచే శరణని తన శరీరమున దాఁగినట్లు కనుపింపఁ బతిమాలుకొనుటకు వచ్చిన యక్షరమాలికవలె నున్న యక్షమాలిక నావలకు విసిరివైచి కోపముచేఁ గదలుచున్న వ్రేళులు గల చేతితో శాపమిచ్చుటకయి కమండలూదకము స్పృశించి శాపోదకము పరిగ్రహించెను.

అనసూయ నవ్వులమునిమీఁది నురుఁగు వలెఁ దెల్లనైన సెల్పులచెట్టు నారతో నేసిన చీర ధరించి తామరతూఁటి దారంబులతో నేర్పఱచిన సన్నని యంశుకంబుచే నున్నతంబు లగు పయోధరంబులనడుమ గాత్రికాబంధము గావించి తపోబలంబుచే జయించి తెచ్చిన త్రిభువనజయపతాకల వలె భూతిరేఖలు మూఁడు లలాటభాగంబున విలాసము నింపఁ దపఃప్రభావముచేఁ గుండలీకరించి తెచ్చిన గంగాప్రవాహముం బోని యోగపట్టంబున వైకక్ష్యకంబు నిర్మించి వామకరంబున విధాత పుట్టిన తమ్మిమొగ్గ వలెఁ జెలువారు స్ఫటికకమండలువును, నితరకరంబునఁ జుట్టిన జపమాలికయు, ధరించి కమలాసనుని సమీపస్థలం బలంకరించి యున్న సావిత్రిదేవి చిందపుంజిప్పయుంగరములచే నిండియున్న చేతి చూపుడు వ్రేలితో భయపెట్టుచు 'ఓరీ! పాపాత్మ! క్రోధోపహత! దురాత్మ! తెలివితక్కువవాఁడ! కుత్సితబ్రాహ్మణుఁడ! అధమాధమ మునినిరాకృత! ఆత్మజ్ఞానశూన్య! నిజాపరాధవిలక్ష! యేమిరా యిది వేల్పులచేత నసు

రులచేత మునీంద్రులచేత మనుజులచేత నమస్కరింపఁబడఁదగినదియు ముల్లోకంబులకుఁ దల్లియు భగవంతురాలు నగు సరస్వతినే శపియించుట కాయత్తపడుచున్నా' వని పలుకుచు నాసనమువదలి లేచినతోడనే యామెవెంట నడిపోయిన జటాభారంబులు యాలలవలె వ్రేలాడ నలుకనిట్టూర్పుగాలిచే బ్రహ్మలోకమెల్ల గజగజలాడ సర్వభస్మాలంకృతంబులగు ఫాలభాగంబులనుండి సోమరసముట్టిపడు నట్లు స్వేదబిందువులు దిగజారు నారగోచులు ధరించియున్న నిరాహారులందఱు నొక్కపెట్ట వేత్రాసనంబులు విడిచి హుంకార ముచ్చరించుచు వెంట నీడ్వఁబడు కృష్ణాజినంబుల కాంతిచేఁ జీఁకటులు గ్రమ్మ దండము కమండలువు మొదలగు నాయుధంబులతో నాదుర్వాసునిపై నుఱికిరి.

దేవా! సహింపుము శాపమున కిది సమయము కాదని దేవతలు బతిమాలుచుండినను, గురువరా! యీయపరాధ మొక్కటి సహింపుమని కోపిష్ఠులోగ్గి శిష్యులు ప్రార్థించుచుండినను, కుమారా! తపస్సుల కంతరాయము కలిగింపకు మని యత్రి నివారించుచున్నను, రోషావేశముచే నొడలు తెలియక దుర్వాసుం "డోదుర్వినీతురాలా! నీవిద్యామదము నేఁటితోఁ బోనడంచెదను, నీ యౌన్నత్యము రూపు మాపెద, నీవు మర్త్యలోకమునకుఁ బోవుదువు గాక" యని శాపోదకము వదలెను. తరువాత సావిత్రియు మరల శపించుటకుఁ బ్రయత్నించుచుండ, సరస్వతి, "చెలీ! కోపము డుపుము, మంచిబుద్ధి లేనివారయినను బ్రాహ్మణులు జాతిచేతనే పూజనీయు" లని నుడువుచు సావిత్రిని మరలించెను.

పదంపడి సరస్వతి యిట్లు శపింపఁబడుటఁ జూచి భగవంతుండగు పితామహుండు కమలంబునం జనించునపుడు తగులుకొనిన బిసతంతువులో యనఁ బ్రకాశించు ధవళయజ్ఞోపవీతంబులు కేల సవరించుచు, వ్రేళ్లనున్న మరకతమయంబులగు నుంగరంబుల మిసిమి నల్గడలఁ బ్రసరింప, దబ్బముడి యుంగరంబున ముల్లోకంబుల యుపద్రవమయినను బాపఁజాలు దక్షిణకరంబెత్తి, శాపకలకలమంతయుఁ జల్లార్చి రాఁబోవు కృతయుగంబునకు సూత్రపాతము చేయుచున్నట్లు, పదిదిక్కులకును దంతకాంతులు ప్రసరింప, సరస్వతి భూలోకమునకుం బోవుటకు ముందు వాయించు ప్రస్థానభేరీరావము వంటి ధ్వనితో, దెసలదురుచు ధైర్యముతో నిట్లనియె. ఓ బ్రాహ్మణుఁడా? యిది సజ్జనులు నడచు దారి కాదు సుమా ఈత్రోవ నడచినచో నీవు భ్రష్టుఁడవు కాకమానవు. ఇంద్రియతురంగంబులను నిరంకుశముగా నడిపించినచో వెడలు రజస్సు దివ్యమగు దృష్టిని పాడుచేయక మానదు; ఈదృష్టి యెంతదూరము చూడఁగలదు. విశుద్ధ మగు

బుద్ధిగలవార లీమాపునకు సారమయిన పదార్థములను గూడఁ జూడఁగలరు. సం
శయములను దెలిసికొనఁగలరు. నీవునిప్పుడువలెనె సమాజ విరుద్ధము లగు ధర్మక్రోధంబు
లు రెండు నెన్నండు నొక్కచోటనుండవు ఆలోకము వదలి యేల చిమ్మంబులోఁ బడి
యెదవు! శాంతమే తపము లన్నిటికి మొదటిదియగు సుమా! రాగద్వేషములు వెదకు
వృష్టికిఁ దండదోషములు గన్పడని యట్లు లలుకనోడమిన మఱియుఁ దనరాగదోషంబు
లు కాననేరదు. గొప్ప తపోభారము మోయుకొక్కఁడ! పురోభాగిత్వ మొక్కఁడ!
కోపమున్నవాఁడు కన్నులున్నను గ్రుడ్డివాఁడే; కోపదూషిత మగుబుద్ధికిఁ గర్తవ్యాక
ర్తవ్యములు తోఁచవు. కోపముగలవానికి కిల్బిషములు శంకర కొంకమునుపే తెలిసికొనం
దవచ్చును; రక్తముకంటెనొయి నాకర్షింపక ముందె యింద్రియంబుల నాకర్షించును;
ఒడలునుండి చెమ్మట జాలకమును పె తపస్సుజాలమును; అధరము స్ఫురింపక మునుపే యు
వకీర్తి స్ఫురించును. విషవృక్షమునకుం బోలె నీకుఁ గూడ వల్కలంబులు లోకవినాశం
బునకే యుపయోగపడుచున్నవి. నీ యీమునివేషంబునకు వృత్తిముక్తయగు ముత్యాల
పేరు వలె వృత్తముక్తయగు చిత్తవృత్తి తగదు. శమనమ్ంబులు లేని చిత్తవృత్తితో నీ
కృత్రిమతాపసాకారమును నటకుని వలె ధరించియున్నావు. ఇంత లాఘవము కల
వాఁడ వగుటచేతనే జ్ఞానసముద్రమున మునుఁగక తేలిపోవుచున్నావు. ఈఋషులం
దఱు నోరులేనివారా! చెవిటివారా! మూర్ఖులా! కోపదోషమున కంగడి యగు నీ
హృదయమును నిగ్రహించుకోఁజాలక యనపంధని యగు సరస్వతి నేల నిగ్రహించితి
వి? లజ్జాకరంబులగు నపరాధంబులన నిట్టివియే. వీనిచేతనే జను లవిదగ్ధులును నిందా
పాత్రులు నగుచున్నారు. అని చీవాట్లు పెట్టి సరస్వతివంకఁ జూచి "పిల్లా! విచారింప
డకుము; యీసావిత్రి కూడ నీతో భూలోకమునకు వచ్చి నాయెడఁబాటు వలని దుః
ఖము లేకుండ నిన్ను వినోద పెట్టఁగలదు. తనూజుని ముఖపద్మము చూచునంతవఱకే
నీకీశాప ముండు" నని యూఱడించి సురల కసురులకు మునీంద్రులకు మనుజులకును సెల
వొసంగి తొందరపాటుతో సన్నిధికి వచ్చిన నారదుని బుజముపయిఁ జేయిడి యాహ్నిక
కృత్యముల నెఱవేర్చుకొనుటకయి సభ విడిచి వెడలి పోయెను. శపింపఁబడిన సరస్వతి
యుఁ గొంచెము తలవంచుకొని తపముచేయుటకై దాల్చిన యిష్టితో లో యన నలుపుఁ
దెలుపుఁ గలసిన కీర్గంటి చూడ్కి వక్షస్థలంబున నిగుడ్చుచు మూర్తిమంతంబు లగు
శాపాక్షరంబులో యనఁ గన్నుని నిట్టూర్పు గాలికై యి తుమ్మెదలు మూఁగుచుండ శాప
దుఃఖంబునఁ జేతులు నిస్సారములు గాఁగ నధోముఖంబు లగు నఖమయూఖంబులు భూ
లోకమార్గము చూపించుచున్నవో యన ముందుఁ బ్రసరింప నందెలు చప్పుడు వినవచ్చి
న పెంపుడురాయంచలు వెంట నడువ సావిత్రితో నింటికిఁ జనుదెంచెను.

అంతట సరస్వతి భూలోకమున కేగు నసువార్తను దెలుపుటకో యన సూర్యుఁడును భూలోకంబున కవతరించెను. క్రమక్రమంబుగ సరోవరంబులు గూడ ముకుళించిన తమ్మితీఁగె లనుభవించు విరహదుఃఖంబునకుఁ జాల నోపకో యన వాసరంబు మందీభవించెను. సమస్తజననేత్రంబగు మిత్రుండును పడమటఁ గ్రోఁతి మొగము వంటి రంగుతో మద్యము త్రావి మదించిన కాముకుల క్రీఁగంటిపంకరచూపులచేఁ ద్రోయఁబడిన వాఁడుంబోలెఁ బడమటి కొండమీఁదికి దిగియె. గ్రామసమీపభూము లన్నియుఁ జంద్రోదయముచేఁ బొంగిన పాలమున్నీటి ముంపు తగిలినవో యన దూడెమీఁది ప్రేమచే నింటి కేతెంచు గేదల పొదుగుల నుండి స్రవించు క్షీరధారలచేఁ దెల్లఁబడియెను. వాహ్యాళికయి వెడలిన వేల్పుటేనుఁగు పైఁడికొండ నెత్తమ్ములందు పఙ్కక్రీడ గావించి కావించి మందాకినీతీరంబున స్వేచ్ఛగాఁ దిరుగఁ బోఁడఁగ. ఆకాశమంతయు భర్తలకొఱకేగు విద్యాధరాభిసారికల కాలి పారాణి యంటుకొనెనో యనునట్లెఱ్ఱవడెను. రక్తచందన మలందికొని పినాకిసేవ చేసిన సంధ్యాంగన మెయినుండి జాఱిన చెమ్మటవలెఁ బ్రకాశించుచు దెస లన్నిటికిఁ గుసుమరస మద్దిన సంధ్యారాగము సిద్ధులొసఁగు నర్ఘ్యోదకముచేఁ దుడువఁబడెనవో యనఁ దగ్గిపోయెను. సంధ్యావందనము సేయు బృందారకబృందము గూడఁ బ్రణామాంజలులు వదలిరి. ధాతకుఁ బుట్టిల్లగు తమ్మిపూవును సేవించుటకై సమస్తకమలాకరములు చనుదెంచినవో యన దీప్యమానంబగు బ్రహ్మలోకంబునందు బ్రహ్మ సాయంకాలసవనమంత్రంబు లుచ్చరింపఁసాగెను. సప్తర్షుల యిండ్లలో ధర్మసాధనమునకై నీరాజనము లిచ్చుచున్నట్లు వైతానికాగ్నిహోత్రంబులు ప్రజ్వలింపఁదొడఁగె. యతు లందఱుఁ బాపరోగంబులఁ బాపుకొనుటకై యఘమర్షణసూక్తులు పఠింపఁదొడఁగిరి. బడలిక తీర్చుకొనుటకై యీఁదులాడు నలుమోముల దేవరతత్తడి రాయంచలచేఁ గైసేయఁబడిన తరగలు గలిగి సంధ్యావందనము గావించుటకై యిసుకతిన్నెలమీఁదఁ గూర్చున్న తపస్విసంఘముచే శోభిల్లు మందాకినీ నదిలో జలదేవతకు గొడుగులై పతత్రికళత్రంబుల కంతఃపురసౌధంబులై తుమ్మెదదిమ్మరీఁడులకు గంజాగృహంబులై దనరు కలువతీఁగెలు వికసింపసాగెను. మెడలువంచి సన్నని తామరతూఁటి తుండ్లచే దురదతీర గోకికొనుచు ఱెక్కల గాలిచేఁ బుప్పొడి నెగరఁ గొట్టుచు మద్యము గ్రోలు రాజహంసకులము తమ్మిపూవులతోఁ బాటు తామును నిద్రింపఁదొడఁగె. వేలుపుతెఱవల తుఱుముల యందలి మల్లెపూవుల తావులు దొంగిలించుచు నొడ్లపై నున్న తీవలు పూచిన పూవులలోని ధూళిచే నేటినీరు బురద గావించుచు నిశాపురంధ్రినిశ్వాససన్నిభంబగు చల్లని గాలి

మెల్లఁగా వీవ సాగెను. చంచరీక నివహంబు ముకుళించుటం జేసి నిక్కపొడిచిన కింజల్కంబులచే సంకటంబగు తమ్మిపూవుమొగ్గలలో నతికష్టముగ శయనించె. చుక్కల గుంపు నృత్యము చేయుటకై నిలిచిన వ్యోమకేశుని జటారణ్యంబు నందలి కొండమల్లెపూవులో యన నుప్పురంబు నిండె. నీలమేఘచ్ఛాయచే బలసి సంధ్యాసంబంధముచే నొకింత కెంపువడి పండిన తాటిపండు ననుకరించుచున్న నల్లని పడుచుచీఁకటి భూమియెల్ల గప్పి పుచ్చె. ప్రతిగృహంబునఁ గటిక చీఁకటి మ్రింగివేయుటకుం దగిన కాంతితో దీపప్రకరంబు యామినీకాంత చెవిపయి నిడుకొన్న సంపఁగి మొగ్గలవలెఁ బ్రకాశించె. చిన్నిజాబిల్లి సన్నని కిరణంబులు ప్రసరించుటఁ జేసి గాఢాంధకారమలీమసంబగు తూర్పుదిక్కు పలచపలచని నీరుగల కాళిందీపులినము రీతిఁ దెల్లవడియె. ఆకాశమును వనరి నల్లకల్వల చెలువు తెల్ల నల్లఁబఱచి చంద్రుని కరంబులచేఁ గచగ్రహణముచేయఁబడి కటికచీఁకటి పోతుపిచ్చుక ఱెక్కల ననుకరించు కాంతిగలదయి మానినీమానసంబుల యందుం బోలె చెంచు మెలఁతల కప్పుకొప్పులందు దాఁగికొనియె. చంద్రుండును దూర్పుకొండ చఱియలలో జరించు సింగము తనయందున్న యిఱ్ఱిని గోళ్లతోఁ జీరదాని కుత్తుకనుండి వెడలు నెత్తుటచేఁ బూయఁబడిన క్రొత్తావి మేనుదాల్చి విభావరీవనిత కావిమోవి వలెఁ గన్పట్టె. చీఁకటి యెల్ల చంద్రికిరణములచేఁ గరఁగిన చంద్రకాంత శిలలనుండి జాలువాఱు జలధారలచేఁ గడగఁబడినదో యన నశించె. చంద్రమండలమును పాల్కడలి యుప్పొంగ క్రమంబుగా నభస్థలము నలంకరించె.

అట్టిసమయంబున శూన్యహృదయయై యేదియో చింతించుచుఁ గన్నీరొల్కుచున్న సరస్వతిం జూచి సావిత్రి యిట్లనియె. చెలియా! ముల్లోకంబుల కుపదేశింపఁదగిన నీయెదుట నా నాలుక మాట్లాడుటకు సిగ్గుపడుచున్నది. ఎవ్వరికయిన ననుభవింపక తీరని దేదియో యది నీవే యెఱుఁగుదువు. దైవుని కుటిలవ్యాపారములు దుర్జనునియందుం బోలె సజ్జనుని యందును దయలేనివి, క్షణభంగురములు, దాఁటరానివి, చెడ్డవి, మర్యాదచూపనివి. ఒక్కొక్కతఱి నభిమానవంతులకుఁ గూడ నిష్కారణముగఁ దిరస్కారము తగనివారివలన నయితము సంభవించుచుండు. ఎడతెగక జాలు కన్నీటిచేఁ దడుపఁబడినచో విపల్లవంబగు చెట్టువోలె విపల్లవము గూడ సహస్రముఖముల మొలకలెత్తు. అతిసుకుమారుఁడగు జనుని సంతాపపరిమాణమయినను మాలతీకుసుమమువోలెఁ వాడుపఱచు. ఏనుఁగున కంకుశంబు వోలె మహాత్ముల బీడించుటకుఁ గొంచెము క్లేశమయినను జాలు. సహజమగు స్నేహపాశముచే నంటఁగట్టఁబడిన జన్మభూమి నెంతవారికైని బరిత్యజింప నలవి కాదు. మాననీయులగు పెద్దలతోడి వియోగము జంపవుఁ గోఁతవ

తె దారుణము హృదయముం జీల్చఁగలదు. నీవంటి తెలివి గలదాని కిట్లు పొగులుట తగదు. నీవు దుఃఖవిషద్రుమాంకూరంబులు మొలచు భూమివి కావు శుభమో యశుభమో బలవంత మగుపురాకృతకర్మము ఫలోన్ముఖమై వెనుకముందు నడచుచుండ దుఃఖింప నవసర మే మున్నది? త్రిభువన మంగళకమలం బగు నీముఖ మమంగళం బగుకన్నీ రపవిత్రము చేయఁగూడదు. కాని మిమ్ము నప్రస్తుతప్రశంస యొందుదు. ఏభూభాగ మలంకరించుటకుఁ గోరుచున్నావో నుడువుము. నీచిత్తమే పుణ్యప్రదేశమం దవతరింపఁ దలఁచుచున్నదో చెప్పుము. ఏతీర్థము లనుగ్రహింప నభిలషింతువో వక్కాణింపుము. ధన్యంబులైన యేతపోవనసీమలయందుఁ దపముఁ జేయ నెంచితివో వచింపుము. నీతో బూడిదె యాటకో లాడఁకొనునాఁటనుండి సహవాసము చేయుచున్న నెచ్చెలి నిన్ననుసరించివచ్చుటకు సిద్ధముగా నున్నది. భూలోకమున కేగుటకు సంకల్పింపుము. సర్వవిద్యావిధాత యగు ధాతయే నీకు దిక్కు గాని యన్యులు లేరు కావున నమ్మహానుభావుని మనోవాక్కాయముల చేత సేవింపుము. సురాసురమౌళిమాలా ధృతచరణధూళిలవుండును గల్పవృక్షకుసుమకల్పితశిరోభూషణుండును త్రిభువనగురువును దేవదేవుండు నగు ముక్కంటి దేవరకు నమస్కరింపుము. పార్వతి కెరఁగుము. ఆపుణ్యదంపతులే నీకచిరకాలంబున శోకనాశన మనుగ్రహింపఁగలరు.

ఇప్పగిది నుపదేశించిన సావిత్రిం జూచి వాగ్దేవి ముత్యములవంటి కన్నీటి బిందువులు గండస్థలములనుండి దిగజాఱ "నెచ్చెలీ! సావిత్రి! నీతోఁ గలసి విహరించుచున్న నాకు బ్రహ్మలోకము వదలితినను దుఃఖముగాని దుర్వాసుండు శపించె నను సంతాపముగాని లేదు. కాని కమలాసనుని సేవ దొరకదను మాటఁ దలఁచుకొనినఁ గడుపు చెఱు వగుచున్నది. భూలోకంబున నేవి ధర్మసాధనప్రదేశంబులో యేవి నివాసయోగ్యంబులో నీవే యెఱుఁగుదువని నుడివి యూరకొనెను. పదంపడి రాత్రి యంతయుఁ జింతచే నిద్ర పట్టక కన్నులు తెఱచుకొనియే వెళ్లఁబుచ్చెను. మఱునాఁ డుదయంబున భగవంతుఁ డగు భాస్కరుండు ఖణఖణలాడు కళ్లెము బిగించి లాగుటచేఁ బుండువడిన పచ్చవారువంబుల నోటనుండి జాఱురక్తముచే రక్తమయిన మేనితో నుదయగిరిశిఖర మధిష్ఠించి మునలికోడి జుట్టువంటిరంగుగల పిచ్చుకకుంటు ముందునడువఁ బ్రకాశించుచుండ సమీపవర్తి యగు నలువతత్తడిరాయంచ యిట్టటుఁ దిరుగుచు నీగీతపద్యము నుచ్చైస్స్వరముతోఁ జదివెను.

గీ. మానస సరోనివాసంబు మాని దిగుడు, బావిలోపల వసియింప వచ్చె ననుచుఁ
బొగిలె దేటికి రాయంచ పువ్వుఁబోడి, మరలఁ జేరెద వాసరోవరము దరికి.

ఆవృత్తాంతము విని సరస్వతి క్రమ్మర నిట్లు విచారించెను. నేనే యూహించనట్టి నాలోచింపఁబడుదుంటి నని తోఁచుచున్నది. కానిమ్ము, మునివచనము నన్యథించెద నని తలఁచి లేచి భూమి మీఁది కేగుటకు సంకల్పించి వియోగముచే సంతాపముఁ జెందు పరిజనముం బరిత్యజించి బంధువుల బాంధవ్యంబు లెక్కింపక జేజేలపెద్దను మువ్వురువేల్పులఁ గొని బతిమాలి యొప్పించి వెంట నను దెంచు జడదారి గుంపులను మరలించి సావిత్రిద్వితీయయై విరించిద్వితీయ బ్రహ్మలోకమునుండి బయలువెడలెను.

తరువాతఁ గ్రమముగా ధ్రువపదమతిక్రమించి యధోధావమానపయోధరపటలం జేసి కామధేనువు ననుకరించుచు, మొఱయుచు, నుక్కుంటి యూపలఁ దాల్చు మాలతీమాలికయయి తనరారు మందాకినీనదిం దరిసి యరుంధతీదేవి నారచీరలు దుకుదేవులు మాచి, యల్లల్లాసు కల్లోలములయందుఁ బ్రతిఫలించిన చుక్కల సొగసు నిరీక్షించి, పితృతర్పణములు సేయుతతిఁ దాపసులు వదలిన నువ్వుగింజలు గల యిసుమతిన్నెల యందమును స్నానము గావించి శుచియై విరించి తీరంబునందు పితృదేవతలకై యిడిన పిండంబులను సూర్యగ్రహణకాలంబున సూతకోపవాసము గావించుటకయి యేడుగురు జడదారులేర్పఱచుకొనిన దర్భపాన్పులును, వారిసుదినము దేవేంద్రుండు శివార్చనకొఱకయి సంపాదించిన పలురంగులుగల పూవులును, నారదునిశరీరమునుండి జాఱిన నిర్మాల్యమకరందమాలికలును, ప్రవాహవేగంబుచే దరి గోయఁబడిన మందరపర్వతశిలాకందరంబులును, వేలుపుఏనుగులాడుల మలుకు గబ్బిగుబ్బల తాఁకున కలఁగి పోయినజలంబులును, గండశిలాఘట్టనంబులచే పలుమొగంబుల మొఱయుచుఁ బ్రవహించు ప్రవాహంబులును, వేల్పుగొ వేల్పునిత్యోపాసనాగ్ని వలనఁ బొడమ్ము ధూమంబుచే ధూసరితంబులగు సైకతంబులును, సిద్ధులర్చించు వాలుకాశివలింగములు దాఁటిపోవుటకు జడియు విద్యాధరుల వీక్షించుచు గగనోరముగ విడిచిన కుబుసమువలె, స్వర్గలోకము ధరించిన లలాటపట్టిక భాతి, పుణ్యపణ్యంబు లమ్ము నంగడిరీతి, నరకద్వారకవాటము తెఱవకుండ సమర్చిన గడియపగిది, మేరుపర్వతము దాల్చిన తలపాగచూరు వడువున, వెండికొండచొక్కా కంటఁ గుట్టిన పటకాలీల, మోక్షంబున కేగు ఘంటాపథము చొప్పునఁ, గృతయుగము చిట్టచివరి యంచువితంబున, దనరారుచున్న యాసాగర మహిషిం దాఁటి, భూలోకంబునకుదిగి, యంబరతలంబు నందుండియే వరుణుని మెడలోని హారమో చంద్రాద్రి తలమీఁది గొడుగో వింధ్యాద్రినుండి జాలువాఱు చంద్రకాంతద్రవమో దండకారణ్యమునుండి ప్రవహించు కర్పూరపుటకంటుల నిష్యందమో దిక్కులనుండి వెడలు లావణ్యరసమో యంబరలక్ష్మిపన్నుంటకై యేర్పఱచుకొనిన స్ఫటికంపుజాలి చవికయో యనఁజెలువొందుచుఁ

జల్లని రుచిగల తెల్లని నీరుగల హిరణ్యబాహు వను మారుపేరుగల గలపెను మహానద్యం బగు శోణనదమును గాంచి దానియందు మిగుల నానందింపఁ దత్తీరంబున నే నివసింపఁ దలఁచి సావిత్రితో “సఖీ! వినఁదగిన కోయిలకూఁతలును బుష్పాఢ్యలతలును గ్రిందఁ రాలి యున్న తియ్యమామిడిపండ్లును బుష్పరేణువులఁ గోరి ముసరిన తుమ్మెదగణములు పాడు పిట్టపాటలును గలిగి మందాకినీతీరభూముల నుపహసించు నీనదోపకంఠప్రదేశంబులును నన్నానందపఱచుచున్నవి. నా చిత్త మిందుండుటకుఁ బ్రేరేపించుచున్న" దని నిజాశయము దెలియఁజేయ సావిత్రి నల్లే యనియె. పిదప దానిపశ్చిమతీరంబునఁ జక్కని కాంతిఫలకలు గల యొకానొక లతామండపంబు గృహంబుగాఁ జేసికొని యందుఁ గొంతతడవు విశ్రమించి సావిత్రితోఁ గలసి దేవార్చనాకుసుమంబులు గోసికొని జలకమాడి శుచి యగునొక్క యిసుకతిప్పపై వాలుకాశివలింగముం బ్రతిష్ఠించి పరమభక్తియుక్తి నైవేద్యం బర్పించి హార్దపురస్సరంబుగ ముదాత్తబంధమునఁ గాంచి భూమి యాకాశము నీరు నిప్పు గాలి సూర్యుఁడు చంద్రుఁడు సోమయాజియు నను నెనిమిదిమూర్తులు గల పరమేశ్వరుని ధ్యానింపుచుఁ బుష్పాంజలియిడి యుపరియత్నలబ్ధంబు లగు కందమూలాదులచేతను సుధకన్న నెక్కుడు రుచిగల చల్లని శోణనదోదకము చేతను క్షుత్తుఁ దీర్చుకొని యప్పగలు గడపి రాత్రి యాపొదరింటిలోని శిలాఫలకము మీఁద నే మెత్తని యిగుళ్ళు పఱచుకొని పవ్వళించెను. మఱునాఁడును సైత మారీతి నే రాత్రిందివములు గడపెను. ఇట్లు కొన్ని దివసంబులు గడచిన కొంతకాల మయినపిదప నొకానొక నాఁడు జాము ప్రొద్దెక్కినతఱి పశ్చిమదిక్కునందు గంభీరమై ప్రతిశబ్దముచే గిరిగహ్వరంబులఁ బూరించు నశ్వహేషితనినదంబు వినఁబడియె. ఆధ్వనికిఁ గడు సంతసిల్లి లతామంటపము నుండి బయటకు వచ్చి విలోకింపుచు నాకాశంబున మొగలిపూవువంటి తెల్లనిరంగుగల పరాగంబును మిక్కిలి దూరము గాని ప్రదేశంబునం బొడఁగాంచెను. క్రమక్రమముగా దగ్గఱకు వచ్చినకొలఁది విస్పష్టమై చేఁపకడుపువంటి రంగుగలిగిన యా ధూళిచక్రంబునందు నీళ్లలో నడచు గుఱ్ఱములవలెఁ బర్వెత్తుచున్న యశ్వబృందముం గనియె. లలాటతటంబున వ్రేలాడుతెలవెండ్రుకల త్రాళ్లచేఁ గూర్పఁబడిన కుచ్చులును, తెల్లని దంతపు చెక్కడములఁబోలు గండంబులును, గ్రీష్మానుపంకముఁ బూసికొనుటచేఁ గషాయవర్ణంబు లైన కంచుకంబులును, నుత్తరీయములచేఁ జుట్టుకొనిన కుచ్చుపాగలును, నడుమునం జేతవ్రేలాడు బంగారుకడియంబులును, రెండుమూఁడు చుట్టిన పట్టుపీలికలచే గట్టిగా ముడి వేయఁబడిన పిడులుగల చురకత్తులును, సార్వకాలిక వ్యాయామంబునం జేసి చిక్కిన శరీరంబులును గలిగి హరిణయూథంబుంబోలె గుంపులుగ దుముకుచుఁ జెట్లకుఁ జెట్లను బుట్టలకుఁ బుట్టలను గూడ

దాఁటించుచు నొక చేత బాణాకట్టలును జెఱకేలఁగత్తులును బ్రకాశింపనడచు నడుమఁ బూవులును బండ్లును దుంపలు నాకులు మొదలగునవి సేనకై సేకరించుచు నడుఁవును నడుఖుము పద పద తొలఁగుము తొలఁగుము దారియిమ్ము దారియిమ్మని యెడతెగనికలకలము గావించు లేఁతప్రాయముగల సహస్రసంఖ్యామాత్రమ్మగుపదాతిబలంబుచే నధిష్ఠింపఁబడిన యావారువంబుల సౌరునకు మిగుల సంతసిల్లెను.

ఆగుఱ్ఱములకు నడుమఁ జొట్టును ముత్యాలచేరులచే నలంకరింపఁబడి రత్నఖండంబులచేఁ గూర్పఁబడి సంకువలెఁ బాలపోలిక నునుఁగుముద్దసందంబునఁ దెల్లనై లక్ష్మినొసఁగుటకై పచ్చినపాలవెల్లివలెఁ బ్రకాశించు శ్వేతాతపత్రంబు నీడయొసఁగ నతిస్వచ్ఛం బైన నగలకాంతి దర్శనానురాగముచే వెంటఁదవిలిన దిక్చక్రవాళమునను కరింపఁ బిఱుఁదుల దాఁక వ్రేలాడు మాలతీపుష్పమాలిక రూపంబునందు ముల్లోకంబుల వారిం జయించి తెచ్చుకొనిన విజయధ్వజంబుం బురణింప, ఖాన్పాలకుం గట్టఁబడిన పద్మరాగమణులనుండి వెల్వడి నల్దెసలకుం బ్రసరించు కాంతిపుంజం బదృశ్యమానలై దారిఁ బాగుచేయుచున్న వనదేవతల చేతిలోని లేఁజివురుటాకు లనుత్ప్రేక్షఁ బుట్టింపఁజేయఁ జక్రనికుటిలకుంతల స్తబకంబులును మనోహరంబులగు పొగడపూవుదండలును గలిగి యొండల నంతర్ధానము సేయుచు దివసమును మ్రింగివేయుచున్నదో యున్నట్లు విరాజిల్లు మౌళియు నెత్తురి శరీరంబును, పశుపతి జటాజూటమం దలంకరింపఁగా మిగిలిన రెండవ చంద్రఖండంబుచే సృజియింపఁబడినట్లు మెఱయుచు సహజంబుగఁ గలకలలాడు లక్ష్మిచే శోభమానంబై మనశ్శిలాఫలకంబువలెఁ బింగళం బగులావణ్యంబుచే నాకాశంబునకు మెఱుఁగుపూఁత వెట్టు లలాటంబును, ముజ్జగంబులయందలి యానందగాండ్ర గర్వమెల్ల దృష్టిపాతంబుచేఁ దృణీకరింపంజాలి విచ్చిన నల్లకల్వలును వికసించిన కుముదంబులును బ్రకాశించు కమలంబులును గలతటాకంబులు వేలకొలఁది సృజించుచు దశదిశలందు నకాలికశరత్కాలధర్మము వ్యాపింపంజేయు కందోయియును నాయతంబులై యిరుగడల నాక్రమించు కందోయిపాలి మేరకై యేర్పఱచిన సేతుబంధమునాఁ దనరారుచు లలాటపట్టిక యను జాబిల్లితాలిపలకనుండి జాలువాఱు లావణ్యరసప్రవాహమనిపించు పొడుగైన నాశికయు, మామిడిపూగుత్తులయందును గాలకర్పూరమునందును పారిజాతలవంగకుసుమంబు లందును గల సౌరభ్యముం గోరు మత్తమధుపకులంబుల కోలాహలంబున శబ్దాయమానం బై వసంతర్తువును సృజించుచున్న మొగంబును, దెసలన్నింటికిని సుధావిలేపము సేయఁజాలు దంతంబులును, మింటఁ జంద్రికాసృష్టిఁ గావింపఁ దగి మాటిమాటికి సుహృత్సంభాషణంబునకై యుత్తానితం బగుచున్న మొగంబునం

దౌలకరించు చిఱునవ్వును, గడిమిపూమొగ్గలం తేసి ముత్యములు రెండింటినడుమ నొక్కొక మరకతమువంతున గ్రుచ్చిన మూడుపేటలుగల కంఠమాలికయు, గుమగుమలాడు పచ్చికస్తూరిచే వ్రాయంబడిన మకరికాపత్త్రములు కలవగుటంజేసి మకరాంకాక్రాంతశిఖరం బగు మకరకేతుకేతుస్తంభద్వయంబుం బోలు భుజయుగళంబును, తెల్లనిజన్నిదముచే నలంకృతం బగుటంజేసి తనమగనివధించె ననుకోపంబుచేఁ జుట్టు గంగానదిచే ముట్టడింపంబడిన మందరంబు చందంబునఁ జెలువారు శరీరంబును గప్పురంపుంబొడి వల్లుకొనుటచేఁ దెల్లవడి యువతిజనకుచచక్రవాకంబులు విహరింపందగిన యిసుముతిన్నెయో యనఁ వన్నెమీఱు వెడందయుఱొమ్మును నాభికధోభాగంబునం దోఁపిన పచ్చెళ్ళు వెనుకకు మడఁచి గట్టిగా బిగించి కట్టుటచే నూరుద్వయవైశాల్యముం జక్కఁగా నేర్పఱుచుచుఁ దనుతరం బగు మధ్యభాగంబును విభజించు పచ్చనికట్టుబట్టయు నెడతెగని వ్యాయామంబుచే బలిసి గట్టిపడిన మాంసము గల జానూపరిభాగంబులును వక్షస్థలంబను తాలిపలక మోఁపునకై దాఁచిన శిలాస్తంభంబు లనందగిన వేల్పుటేనుఁగుతొండమువంటి తొడలును నునువైన యూరువులబరువు మోయుటచేతం బోలెఁ జిక్కిన పిక్కలును గుల్ఫమునకు రెండుప్రక్కల వ్రేలాడు కల్పపాదపపల్లవపటలమువంటి యడుగులనుండి వెడలి యుయ్యాలలూఁగుచు నశ్వమున కలంకారార్థముగ వేనవేలు చామరములు సృజించుచున్న నఖకాంతులును గలిగి ప్రకాశించుచు మాటిమాటికి దంతములచేఁ గొఱుకుటంజేసి గలగలలాడు కళ్లెంబును బొడుగైన నాసికయందుం దగుల్కొనిన కవికయు లలాటపట్టికయందుం దొరలు చామీకరచక్రంబును మెడలో బంగారుమువ్వలును గొండముచ్చుచెంపల రంగుగల రోమంబులును నీలిగోరింటపూవువంటి యొడలిరంగును గలిగి యభిముఖముగా నెగురుచుఁ జిరకాల ముపరిభాగంబునంద నిలుచుచు టకటకారావంబు కావించు కాలిడెక్కలతాఁకునం బుడమి గుంటలువడ మనోవేగంబునం బరువెత్తు నొకానొక యుత్తమాశ్వము నెక్కి యిరుగడల నిరువురు పరిచారకులు జీనుమీఁద నొకకేలువైచి వెంటఁ బరువెత్తుచు రెండవకేలఁ జామరంబులు విసరుచుండ ముందునడచు వందిమాగధులు కావించు కైవారంబునకుం దలయూఁచుచు మన్మథునియపరావతారమువలెఁ జందురుని పునస్సృష్టివితంబున జీవలోకమునెల్ల విలాసప్రాయముఁ గావించుచు దివసమంతయు శృంగారమయముగా నొనర్చుచు నేత్రముల కాకర్షాంజనమై మనంబునకు వశీకరణమంత్రమై యింద్రియములకు స్వాస్థ్యంబొనర్చుచూర్ణమై కౌతుకమునకు సంతోషమై సౌభాగ్యంబునకు సిద్ధియోగమై మదనునకుఁ బునర్జన్మదివసంబై యౌవనంబునకు రసాయనమై సౌందర్యమున కేకాధిపత్యమై రూపంబునకుఁ గీర్తిస్తంభమై

ఔశ్చర్యము పుట్టించును. మహానుభావుండైన యీకుమారుని సౌందర్యము లోకత్రయని వాసులకును బరాభవముఁ గావించినది. సౌజన్యపరతంత్రమైన శిష్టాచార మడిగించుచున్నది గాని యాఁడువాండ్రతోఁడఁబుట్టిన చాపల్యము గాదు సుఁడీ! కావునఁ జెప్పుఁడు. ఈమహానుభావుని పరిత్యాగముచే నేదేశము దురదృష్టవంత మయినదో! ఈకుమారుని విరహంబున నెచ్చటిప్రజలు దుఃఖించుచున్నారో! ఈసుందరాకారుని దర్శనంబున నేదేశము వారు ధన్యవంతులో! యానతీయవలయును. ఈశ్వరుని సాంకారహుంకారములకుఁ గూడ జడియని యీమహానుభావుఁ డెవ్వఁడు? కౌస్తుభమణి హరిహృదయము నలంకరించిన ట్లుపశోభిష్ఠమైనయీకుమారుఁడు పుణ్యాత్ముండైన యెవ్వని యురము నలంకరించెనో! ఆతండెవ్వరు? గొప్పతేజస్సును గన్న ప్రభాతసంధ్యవలె నీమహాతేజస్విం గని త్రిభువనవందనీయ యయిన యిల్లా లెవరు? ఈసింహాసంహనుని పుణ్యనామంబునందు నివాసముఁ గాంచిన పుణ్యాక్షరంబు లెవ్వి? ఆనతిచ్చి పిదప దేవరయుడంతయుఁ గూడఁ దక్షణముగానే నుడివి మాహృదయమున్న కానంద మాపాదింపుము. అనియడిగిన సావిత్రింజూచి వృద్ధుండును బ్రకటితవినయుండై యిట్లనియె. ఆయుష్మంతురాల! సాధువులకుఁ బ్రియవాదిత్వము కులవిద్య, వారు సుధాకరకమనీయం బగు మొగముచేఁ గాక సుధాకరకరశీతలమ్ములగు మాటలచేఁ గూడ హృదయమును సంతోషపెట్టుదురు. సౌజన్యజన్మభూములైన మీవంటి బాలికల దర్శనము శిల్పవిద్యాధికమునువలెఁ బూర్వజన్మకృతసుకృతాతిశయమున్నఁ గాని ఘటస్థింపదు. ఆన్యోన్యసల్లాపము మాట ట్లుండనిమ్ము. సత్పురుషప్రమాతుల దృష్టితోడి సంబంధము దృష్టికిఁగలిగినంతనే పరమానందము కలుగును. విను మీకుమారుండు భార్గవవంశభూషణము నిజతేజః ప్రసారంబునం బులోముని దహించి యుదగ్ర ప్రభావంబున జంభారి భుజస్తంభంబుం గూడ స్తంభింపం జేసి స్వర్గమర్త్య పాతాళలోకములకుం దిలకమై సురాసురమౌళిమాలామాణిక్యపుంజరంజిత పాదపంకజుండై ప్రసిద్ధిఁ గాంచిన భగవంతుండగు చ్యవనమహామునికి బహిఃప్రాణంబగు కుమారుం డితనిపేరు దధీచుండు. జగములెల్ల జయించి పెక్కుమంది రాజులచేఁ గప్పములు గొన్న శర్యాతమహారాజు కూఁతురు త్రిభువనకన్యారత్నమగు సుకన్య యితనితల్లి. ఆ సుకన్యాదేవి యితనిం గడుపున ధరించియున్న సమయంబునఁ బ్రసవంబునకై వైజననమానంబున శర్యాతుం డల్లుని యింటినుండి తన యింటికిం గొనిపోయె, నామె యీదీర్ఘాయుష్మంతునిఁ బితృగృహంబునం బ్రసవించె. సంతోషితబాంధవుండును రాజీవలోచనుండు నగు నీబిడ్డఁ డారాజగృహమునందే శుక్లపక్షచంద్రునివలెఁ బెరిఁగెను

సుకన్యయుఁ బిసప భర్తృభవనంబునకుఁ జనుదెంచినను సకలలోచనాసేచనక దర్శనుండును మనోవినోదియు నగు మనుమని మాతృమాతామహుఁడు పంపింపఁడయ్యెఁ. తాతగారియింట నే యితఁడు సమస్తవిద్య లభ్యసించెను. సర్వకళలు నేర్చుకొనియెను. క్రమక్రమముగ యౌవనశాలియయిన యీమనుమనిఁ గాంచి మాతామహుండు నావలెనే తండ్రియు నే తన్ముఖకమలావలోకనానందముఁ గొన్నాళ్లనుభవించుంగాక యని తలపోసి తండ్రియింటికిఁ బంపించుచున్నాఁడదే యీప్రయాణము. నేను సుప్రసిద్ధనాముండగు శర్యాత నృపాలుని యాజ్ఞాకారి యగు భృత్యపరమాణువుంగాఁ దెలిసికొనుము. నాపేరు వికుక్షి; పితృభవనంబునకుం జను నితనికి తోడుగా మాప్రభువు నన్నంపించె. మేము తాతముత్తాతలతరములనుండియు నారాజవంశమునకే భృత్యులము. చిరకాలమునుండి సేవ సేయుచున్నచోఁ బరిజనులయందును బ్రభువులకు బాంధవసమానబగు చను వుండును. మహాత్ములకున్న దాక్షిణ్యకోశము పెద్దది. ఇచ్చటి కాచ్యవనమహామునితపోవనము రెండుక్రోసుల దూరమందున్నది. ఆయ్యాశ్రమంబునకును నత్తపోధనుండు తనపేరే కల్పించెను. దాని రామణీయకము చైత్రరథమును మించునది. దాని దగ్గఱనే శోణనదము ప్రవహించుచున్నది. అచ్చోటే మాయాత్ర కవధి. మీరు నాయడు దాక్షిణ్యము గలదేని మీహృదయమునందుఁ బరిహాసముగాఁ దలఁపరేని మాపై ననుగ్రహము కలదేని నీమనుష్యులు వినఁదగినవారేని ప్రథమదర్శనసంజాత మగు ప్రణయము మఱవక కుతూహలంపడు మాహృదయమును బరాభవింపక నాయుత్కంఠురాండ్రగు నీవృత్తాంతము నొడివి యీ కర్ణములకు రసాయనము పెట్టుఁడు. ఇటువంటి సౌందర్య విశేషమునకు దేవతాంశ యుండక తీఱదని నా నమ్మకము. వంశములును పేరులును వినఁదలఁచిన నా డెందమును సిగ్గుపఱుపకుఁడు. మీ పుట్టువుచే స్పృహణీయమైన వంశ మేది? ఈపూజ్యురా లెవ్వరు? పరస్పరవిరుద్ధపదార్థములు గూడ నీ మెయిం దేకీభవించి యున్నవి. భాస్వన్మూర్తి యయ్యును సన్నిహిత బాలాంధకార, పుండరీకమణి యయ్యు హరిణలోచన, బాలాతపాధరి యయ్యుఁ గుసుమహాసిని, సమదహంసస్వన, సమున్నతపయోధర, కమలకోమలహస్త, హిమగిరిశిలావిశాలనితంబ, కరభోరువు, మందగామిని, పరిత్యక్తకౌమార, ప్రస్నిగ్ధతారక, యీనారీమణి పేరెవ్వరు? అని యడిగిన వృద్ధుం జూచి మరల సావిత్రి "ఆర్యా! మావృత్తాంతము తయుఁ గొంతకాలమునకు విందువు. మా హృదయము చాల దినము లిందలి నివాసమే గోరుచున్నది. పరిచయమే ప్రకటింపఁగలదు. పరస్పరనివాసంబులకును నడిమిమార్గము. దూరము కాదు గదా; అప్రయత్నదృష్టంబైన యీజన మాన్యుఁడు మఱువఁదగి

నది కాదు, అని పలికి యూరకుండెను. దధీచుండును గళాంబుదారావగంభీర మగు భారతిచే వనమయూరశోకంబున కాటలు నేర్పుచు ని ట్లనియె. ఆర్యా! మనమారాధించు వార్యామహాదేవియే మనల ననుగ్రహించు లెస్స. తండ్రిగారిం జూడవలయుఁ బోదము. అని నుడివిన వికుక్షియు వల్లె యని యల్లల్లన లేచి నడువఁ గుమారుండును కృతనమస్కారుండై వెడలె. అశ్వారూఢుండై పోవుచున్న దధీచుని సరస్వతియుఁ బ్రీతివిస్ఫారితంబును నిశ్చలతారకంబును సముత్తంభితపక్ష్మంబు నై చిత్రలిఖితాకృతి ననుకరించు చూపులం జూచె. చ్యవనకుమారుండును శోణనదముం దాఁటి కొలఁదికాలములోనె పితాశ్రమంబుం బ్రవేశించె. అతండు విలోచనపథము దాఁటిన తరువాతను సరస్వతి యాదెసయందలి చూడ్కి మరల్పక చిరకాలముండి యుండి యతికష్టంబునఁ దద్దృష్టి మగుడింపఁగలిగె.

పదంపడి ముహూర్తకాలము ధ్యానించి తథావిధంబగు నతని సౌందర్యము స్మరించి స్మరించి సరస్వతి డెందము మిగుల నచ్చెరు వొందఁజొచ్చె. కందోయియు నక్కుమారుని పునర్దర్శన మభిలషించె. దృష్టిమరల్ప శక్యముగాక తద్దిశాగమనంబునకే ప్రయత్నింపఁ దొడఁగె. వెంటఁ బోవుమని పంపకున్నను మన మవశమై యతని వెనువెంటనే చనియె. తీఁగకు లేఁజిగురు దనయించిన క్లైందువలననో చిత్తంబున కనురాగ మంకురించె. నలసురాలివలె శూన్యహృదయచందంబున నిద్రించు భంగి పగలంతయుఁ గడపి లంకాలికాకుసుమగుచ్ఛ వర్ణనీయం బగువర్ణంబుతోఁ గమలినీకాముకుండు ప్రతీచీవిపర్యస్తమండలుండై యస్తంగమించె.

ముసలిబెగ్గురుపిట్ట తలవంటి సంజకెంజాయ ప్రత్యగాశాముఖము నలంకరించె. తరుణతమాలశ్యామలం బగు నంధకారచ్ఛట దిక్కులెల్ల నేకీకరించెను. పరిభ్రమత్సిద్ధకామినీ నూపురారావంబునంబలి యానచే వేల్పుటేఁటి నీటినుండి వెడలు రాయంచమూద్రిఁ గుముదినీమనోహరుండు గగనాంగణంబునకుం దయచేసె; నిశాముఖమందు సంధ్యావందనంబుఁ గావించి సరస్వతియు విముక్తాంగియై చిగురాకుఁబానుపుం జేరె. సావిత్రియు సాయంకాలోచితక్రియాకలాపంబు నిర్వర్తించి నిదురింపఁదగిన కాలంబునం బ్రవాళశయ్యపై నిదురించె.

సరస్వతియుఁ బ్రతిక్షణంబునం బొడము నంగవలనంబులవలనఁ బరిమ్లానం బైన యిగురుటాకుసెజ్జపై దొరలుచుఁ గన్నులు మూసికొనినను నిద్దురరాక మదినిట్లు తలపోసె. మర్త్యలోకమే సర్వలోకములకన్నఁ బ్రశస్తమైనది. త్రిభువనభూషణంబులును సకలగుణగ్రామావాసంబులు నగురత్నము లిందుఁ దప్ప మఱియెందును సంభవింపవు.

ఆహా! యేమి! యాచ్యవనకుమారుని రామణీయకము! సత్యముగాఁ దన్ముఖలావణ్యబిం దువే యిందుబింబము. తత్కటాక్షవిక్షేపములే కమలకుముదకువలయాకారములు. తదీయాధరమాణిక్యరుచులే మంకెనపూవుందోఁటలు. తదీయశరీరలావణ్యసారమే పూవిల్తునకు జీవనాధారము. కటకటా! ఏకాంతల కీదివ్యాకృతి కంటఁ బడునో వారి నేత్రములే పుణ్యపాత్రములు, వారిమనంబులే సుకృతఘనంబులు, వారియౌవనంబులే కుసుమితవనంబులు. మదీయపూర్వజన్మకృతపాపాతిశయమే యామహానుభావుని దర్శనమొక్కత్రుటికాలము నాకులభింపఁజేసె. నాకిప్పు డేది తెలువు! అని చింతించి చింతించి యెట్టకేలకుఁ దనపై దయఁ జూపించిన నిద్రాదేవతకతంబున నే యామహానుభావుని దర్శనానందము రెండవసారి యనుభవించెం గాని మకరకేతుండు మఱి మది సహింపలేక యాకర్ణాకృష్టం బగుచాపదండంబునం బూవుటమ్ములు దొడిగి దయాదూరుండై తాడింపఁ దదాఘాతంబులు తనకుం గూడఁ దగులునో యనుభీతిచేతం బోలె నిద్రాదేవి వదలిపాఱిపోయెను. ఇట్లు దినరూపంబు లగుకొన్ని మహాయుగంబులు చన మదనశరవిద్ధ యగుచుఁ జిక్కిపోయిన యామెయవస్థ బరిశీలింపుటకుం బోలె నరతి యాశ్రయించెఁ, గుసుమధూళీధవళితంబు లగునవలతలచేత నతాడితయయ్యు విశేషవేదనాభర మనుభవింపఁ జొచ్చె, మందమారుతధూతం బగుపుప్పొడి కంటిలోఁ బడకయున్నను గన్నీ రోడువసాగె, రాయంచ ఱెక్కలచేఁ జిమ్మఁబడిన శోణనదశీకరంబులచేఁ దడుపఁబడకపోయినను జలార్ద్రయయ్యె, రాజహంసమిథునంబులచే వెలయు కనకకమలినీకల్లోలదోలికలచే వహింపఁబడక పోయినను ఘూర్ణితయయ్యె, వియోగమును జెందిన చక్రవాకమిథునంబులచే విడిచిపెట్టఁబడిన నిశ్వాసవాయువులచే నావరింపఁబడకపోయినను నల్లపడియెఁ, బుష్పధూళిధూసరంబు లగుతుమ్మెదగుంపులచే సందష్ట కాకపోయినను గంపింపసాగె.

ఈపగిదిఁ జాలరాత్రులు గడపుచుండ వికుక్షి తనదేశమునకు మరలి వెనుకటి దారినే యాసరస్వతీసావిత్రులున్నచోటికి వచ్చి పరిజనమునెల్ల దూరముగా నుండనునిచి గొడుగుమాత్రము చేతఁబూని పొదరింటిలోనికి రాఁబోవుచుండ సరస్వతియు దూరము నుండియే సమూహముగా వచ్చుచున్న యతనిం జూచి సంభ్రమముతో లేచి యెడవిలేడివలె మెడయెత్తి ధవళితదశదిశావలయములగు కటాక్షప్రసారములచే మార్గాయాసపరిశ్రాంతుండగు నతనిం దడుపుచున్నట్లు చూడసాగె. సావిత్రియు నావృద్ధున కర్ఘ్యపాద్యము లొసంగి కూర్చుండఁ బీఁట నిడి పరిశ్రాంతి నపనయించుకొనిన పిదప నిట్లనియె. ఆర్యా? ఆరాజకుమారుఁడు కుశలియై యున్నవాఁడుగద! అని యడిగిన న

తండును "ఆయుష్మతీ! కుశలియై యున్నవాఁడు, సర్వదా మిమ్ములను స్మరించుచున్నవాఁడు. ఏలొకో యతని శరీరముమాత్త్రము మిగులఁ జిక్కుచున్నది. శూన్యహృదయుఁడై తిరుగుచున్నాఁడు, హేతువేమో తెలియదు. మాలతియను పేరుగల యొక యుత్తమస్త్రీ నా వెనువెంటనే యతని సమాచారము మీకుఁ దెలుపుటకై వచ్చుచున్నది. ఆమె యీ రాజపుత్త్రికనకు బహిశ్చరప్రాణము" అని నుడివిన సావిత్త్రియు నా రాజపుత్త్రుఁడు మిగుల మహానుభావుఁడు గదా! అదివఱకెవ్వరో యెఱుఁగక యొక నిముసము చూచి మాటలాడిన మావంటివారియం దిప్పటికి విశ్వాసముంచియున్నాఁడు అతఁడు యదృచ్ఛగాఁ బోవుచుండినను నెట్లో దారి నడచుచుండఁ బైబట్ట ముఁడ్లలోఁ దగులుకొన్నట్లు మనస్సు మాపైఁ దగులుకొనియె. మీస్వామిసూనుని యాభిజాత్యమా యమూల్యమైనది. సౌజన్యమా యంతకన్న విలువైనది. ఆహా! లోక మెంతమందమతి గదా! సులభస్నేహముచే మెత్తనైన మహాత్ముల చిత్తము నేదియో యొకటి నిచ్చి కొనలేకపోవుచున్నదిక దా! మహాత్ములకున్న యౌదార్యాతిశయ మనిర్వాచ్యమైనదియు నితరజనదుర్లభమైనదియు. వారు తలఁచిన ముల్లోకములనైన నీయఁగలరని ప్రసంగింప విదుషియు ననేకవిధములైన మృదుసంభాషణలచేఁ గొలఁది కాలమైనను జిరకాలమన్నట్లుండి తానుబోవఁ దలఁచిన దేశమునకుఁ బోయెను.

మఱునాఁడు చుక్కలన్నియు నస్తమించి చీఁకటి యెల్ల మాసి తూర్పునంజ ప్రబలి సూర్యోదయమయినపిదప శోణనదము దాఁటివచ్చుచున్న సమయంబున తన తరళదేహప్రభాపరంపరలచే శోణనదోదకమును మఱింత తెల్లవడునట్లుచేయుచు వికసించిన యతిముక్తకుసుమగుచ్ఛంబులవంటి రంగు గలిగి సటాలమై పెద్దసింహమువలెఁ దెల్లనై యున్న యొకగుఱ్ఱముమీఁద విలాసముగఁ గూర్చుండి ప్రక్క పారాణిపూఁతయు మీఁదఁ గుంకుమపూఁతయుఁ గలిగి గుఱ్ఱము చెవులు నిక్కపొడుచుకొని యానందముతో వినుచున్న మ్రోఁతమ్రోయుమంజీరములచే నలంకరింపఁబడి యశ్వోరఃపీఠాగ్రోషితమై యున్న చరణయుగళము నుండి రెండుప్రక్కలకుఁ బ్రసరించు కాంతిప్రవాహము తాడనదోహదము నపేక్షించి వెంటఁ జనుదెంచుచున్న రక్తాశోకవనమను భ్రాంతి పుట్టింప సర్వజీవలోకము నొక్కసారి యాకర్షింపఁగల నని బిరుదభేరీ వాయించుచున్నదో యనునట్లు మ్రోఁగు గంటలయొడ్డాణము జఘనస్థలంబునం దొరపుసూప నేత్త్రాకారమైన కుట్టు చేనిండి పదములవఱకు వ్రేలాడు పాముకుబుసమువంటి తెల్లని కంచుకము సందులనుండి హిమచందనధవళంబులగు నవయవంబులు బైటకుఁ గన్పడుటంజేసి స్వచ్ఛమైన నీటివడిమి తామరతూండ్లుపైకిఁ గన్పడు చెలువునఁ బ్రకాశించుచుఁ

కుసుంభరాగపాటలమై పులకబంధచిత్రితమై యున్న చండాతకమువలన రత్ననిధానంబైన స్ఫటికభూమివలెఁ బ్రకాశించుచు నుసిరికాయలంత ముత్యములుగల హారములచే శరత్కాలమందుఁ దెల్లనిమొగులునిండఁ బెద్దనక్షత్రములు మాత్రము కన్పడు నాకాశలక్ష్మివలె విరాజిల్లుచుఁ బూర్ణకలశములవంటి కుచములమీఁద వ్రేలాడు రత్నప్రాలంబమాలిక నొకానొక యదృష్టవంతుని హృదయప్రవేశమునకైన వనమాలికవలె ధరించుచు మరకతమకరవేదికాసనాథమై ముంజేత వెలయు నొంటిబంగారు కడియమునుండి వెడలు మయూఖచ్ఛటలు లక్ష్మీభ్రాంతిచే ననుసరించు పెట్టతామరతీవల ననుసరింప మాటిమాటికిఁ దాంబూలము నములుటచేఁ గలిగిన నల్లచాలుగల యధరంబుచే సంధ్యారాగముతోఁ గలిపి ముఖచంద్రుఁడు మ్రింగిన చీఁకటిని మరలఁ గ్రక్కుచున్న చెలువుఁ దెలుపుచు నయనంబులను జూచి విచ్చిన కల్వపూవు లనుభ్రాంతి వడి ముసిరిన తుమ్మెదగుంపులో యన నలరారు ముంగురులచే సగము మొగము మాటువడ నీలిమందు రంగు పూఁతచే నల్లనడి కాలకంఠ కంఠకాళిమను నిరసించు చెవిలోని దంతపత్రము వలనఁ గాలమేఘపల్లవితంబగు మెఱుపుఁదీఁగవలెఁ జెన్నుమీఱుచుఁ బొగడకాయలంతలేసి మూఁడు మూఁడు ముత్యములు గూర్చిన యధోముఖములగు వాలికాయుగళము కాంతిజలస్యంది యగుటం జేసి యతికోమలంబగు భుజలతలం దడుపుచున్నట్లు విన్ననువు చూప దక్షిణకర్ణావతంసమైన కేతకీగర్భదళము కోమలకపోలతల లావణ్యామృతము నానుటకై ముఖచంద్రుఁడు సాఁచిన నాలుకవలె విలసిల్లఁ గస్తూరికాపరిమళనిష్యందియై తమాలశ్యామలంబైన తిలకము మదనుని సర్వస్వము దాఁచికొనిన వదనమను పెట్టెపై ముద్రించిన ముద్రికవంటి కల్మిలీన సీమంతమువఱకు వ్యాపించి లలాటమందు నృత్యముసేయు లలాటికామాణిక్యము నుండి వెడలు నరుణకాంతిపుంజము రక్తాంశుకముచేఁ గల్పింపఁబడిన మేలిముసుఁగై వన్నె నింప ననాదరముగా ముడివైచిన తలవెండ్రుకల ముడి పృష్ఠభాగంబుపై నటనంబు నలుపుటం జేసి నల్లగుడ్డ వ్రేలాడఁగట్టిన మకరకేతుకేతుస్తంభభ్రాంతిఁ బుట్టింపఁ జందురుని కులదేవతయో యనఁ బుష్పబాణుండు మరల జీవింప సిద్ధముచేసిన సంజీవనౌషధియో యన ననురాగసముద్రమున కవధి యగు వేలయో యన యౌవనచంద్రోదయమువలనఁ బొడమిన వెన్నెలయో యన రతిరసామృతము ప్రవహించు మహానదియో యన సురతవృక్షము పూఁచిన కుసుమపంక్తియో యన వైదగ్ధ్యమునకు మొదటిచదువో యనఁ గాంతికిం గౌముది యన ధైర్యమునకు ధృతియన గౌరవమునకు విద్యాశాలయన వినయమునకు బీజభూమి యన గుణముల గోష్ఠియన మహానుభావత యభిమానమనఁ దారుణ్యమునకుఁ దృప్తి యన నల్లకల్వ రేకులవలె దీర్ఘము

లైన నేత్రములును బొటలమైన వాతెఱయును మల్లిమొగ్గల వంటి దంతములును దిరిసె
న పూవుదండలవంటి భుజములును గమలకోమలంబు లగుకరంబులును బొగడపూవుం దా
విగలిగిన నిశ్వాసవాయువులును జంపకపుష్పమువంటి యొడలిరంగును గలిగి కుసుమమయి
యశఁబ్రకాశించుచు మహాప్రమాణము గల వారువము నెక్కిన యొకానొక తాఁబూ
లకరండవాహినిచే ననుగమ్యమానయై మఱికొందఱు పరిచారికలు వెంట నడువ మాలతి
యుఁ జనుదెంచె. సరస్వతియు దధీచుని యందలి ప్రేమముచే నామెను దూరమునం
దచూచి మనోరథములలోఁ బడి దొరలినట్లు కుతూహలముచే లాగఁబడినట్లు సాత్త్వి
కలచే నెదుర్కొనఁబడినట్లుత్కంఠచేఁ గౌఁగిలింపఁబడినట్లు హృదయముచే నంతః
ప్రవేశము చేసికొనఁబడినట్లానందముచేఁ దడుపఁబడినట్లు చిఱునవ్వుచేఁ బూయఁబడిన
ట్లు నిట్టూర్పువాయువులచే విసరఁబడినట్లు శరీరమెల్ల నేత్రమే యయినట్లు వదనపుం
డరీకముచేఁ బూజింపఁబడినట్లాశఫలించినట్లు లేచి యానందముతో దబ్బుదబ్బున నా
మాలతి సమీపమునకుం బోయెను. మాలతియుఁ దురఁగము డిగి దూరమునుండియు
వంచియున్న తలతో నమస్కరించి సావిత్రిసరస్వతు లిరువురు నాశ్లేషసుఖ మనుభవిం
చినపిదప సల్లాపానందముం జెందిన తరువాత తన్నుం దాన యదృష్టవతిగాఁ దలపోసి
కొనుచుఁ గూర్చుండి దధీచుని సందేశము నుడివి శిరోధృతమగు దోసిలిచే వారిడిన నమ
స్కారముం బరిగ్రహించి యాకారము మొదలుకొని దేనియందును నాగరకత లో
టులేనిదగుటం జేసి యతిపేశలంబులగు సల్లాపంబుల వారి యిరువురి చిత్తంబు లా
కర్షించెను.

క్రమముగా మార్తాండుండును నభస్థలమధ్యప్రదేశ మలంకరించుచుండ సావిత్రి
స్నానమునకై శోణనదమునకుం బోయిన తఱి వేచి పరిజనము నావలకుం బొమ్మని స
న్న చేసి పూసెజ్జయందుం బవళించియున్న సరస్వతి దగ్గఱకుంబోయి మాలతి యిట్లని
యె. దేవీ! సరస్వతి! నీతో గూఢముగ విన్నపము సేయఁదగిన యంశ మొకండున్నది
కావున ముహూర్తకాలము సావధానవై విని నన్ననుగ్రహింప వేఁడుచున్నాను. అని
న సరస్వతియు దధీచసందేశమేకదా యని శంకపడి చంగోయిపై నిడికొన్న చేతిగో
రులకాంతి కవచితంబై కుతూహలాంకురములు మొలక లెత్తుచున్నదో యన హృదయము
ను నుత్తరీయదుకూలైకదేశంబునం గప్పికొనుచుఁ గర్ణావతంసము వార్తాశ్రవణంబునకై
పయిగెత్తుచున్నదో యనఁ గదలు చెవిపంటి జాఱ శ్వాసపవనసంపర్కంబున నుయ్యెల
లూఁగు చలించు దగ్గఱయున్న దీపము జీవితాశఁబోలె నిల్పఁబెట్టుచు వికసించిన ముఖచం
ద్రమునుండి దిగజాఱు లావణ్యప్రవాహముచే శృంగారరసముచేతంబోలె జీవలోకమునె

ల్లఁ దడుపుచు మదనానలదాహశ్యామలంబులై మూర్తిమంతంబులైన మనోరథములచే తం బోలె పూవుందావికై వచ్చిన తుమ్మెదకొలమ్ములచేఁ గుసుమశయనీయంబునుండి లేవఁగొట్టంబడుచు స్మరజ్వరముచే మందమందముగా సమీపించి రహస్యముగాఁ జెప్పమని కపోలతలప్రతిబింబితయగు మాలతిని సిగ్గుచేఁ గర్ణమూలమునకుం దీసికొనుచున్నదో యనఁ జెవియొగ్గి సుధామధురంబులై ధీరంబులైన వాగ్గుంభనలతో "సఖీ! మాలతీ! ఏల యిట్టిమాటలాడెద వవధాన మనుగ్రహింపుమనుట కే నెంతదానను శరీరములకుం గాని ప్రాణమునకుంగాని యింక మఱిద్దానికిఁగాని నేఁ గోరక పోయినను నీవే సమర్థురాలవు, వెయ్యేల సర్వమునకును నీవే నాకు దిక్కు; నాకుం దోఁబుట్టిన దానవు, చెలికత్తెవు, ప్రణయవతివి, తల్లివి, నీవే కాక నాకిఁకెవ్వరున్నారు? నియోగింపుము, గొప్పకార్యమునకుం గాని యల్పకార్యమునకుంగాని దేనికైన నీశరీరము నీయది; నేను నీదానను. నాచిత్తము నీవు చెప్పినట్లు వినునది, నీయెడలఁ గాపట్యరహితమైనది, నీకు నే విధేయురాల, ననుకూలురాల, నోవరవర్ణినీ! చెప్పఁదలఁచినమాట సవిస్తరముగా నానతిమ్మని" ప్రార్థించెను.

మాలతియుఁ "చెలీ! సరస్వతీ! విషయములయందలి తీపియు నింద్రియములయందలి లోలుపత్వంబును నవయౌవనము సేయు నుత్సాహంబును మనంబునకుం గల చాపల్యంబును నీవెఱుంగినవియే, మన్మథుని దౌర్జన్యము ప్రసిద్ధమైనదియే కావున నేనీవిషయంబున నిందింపఁదగిన దానను గాను. నా వాచాలత్వమునకు సేవకత్వముగాని, చాపల్యముగాని, దూతీధర్మములు గాని కారణములుగావు. అసాధారణమైన స్వామిభక్తి చేయింపని కార్యములు లేవు. నీవు మాస్వామికంట నెప్పుడు పడితివో నాఁటినుండి యా కుమారునకు మన్మథుఁడే గురువు, చంద్రుఁడే జీవితేశుఁడు, మలయమారుతమే యుచ్ఛ్వాసహేతువు, వసంతుఁడే యాంతరంగికుఁడు, సంతాపమే పరమస్నేహితుఁడు, జాగరమే మిత్రముగా నున్నయది. అతని మనోరథములు చొచ్చి చూడని తావులు లేవు, నిశ్వాసములు పగతీర్చుచున్నవి, మృత్యువు పార్శ్వవర్తినియై తిరుగుచు విచారమును కలుగఁజేయుచున్నది, సంకల్పములు బుద్ధిని మఱుఁగుపఱచుచున్నవి. దేవీ! నేనేమి విజ్ఞాపనము సేయుదును. మా రాజకుమారుఁడు నీకుందగినవాఁడని నా యూహ. శీలవంతుఁ డంటినా పరిక్రమవిరోధము, ధీరుఁ డంటినా ప్రకృతావస్థకుఁ దగనిది, సుందరుఁ డంటినా యది నీ వనవలసినమాట, నీ యందు స్థిరప్రీతి కలవాఁ డంటినా యది దూతీనైపుణ్యసూచకము, నిన్ను సేవించుటకుం దగినవాఁ డంటినా యది ప్రభుత్వమునకుం దగని పలుకు, వచ్చినందాఁక నీకు దాసుఁ డంటినా యది ధూర్తాలాపము,

యింటి కధిపతి వగుదువంటినా యది యాశపెట్టుట, ఆట్టిభర్త నీయదృష్టవశంబునం దొరకెనంటినా యది స్వామిపక్షపాతము, నీవు లేకున్న నతఁడు చచ్చిపోవునంటినా యది యశ్లీలము, నీవు గుణజ్ఞురాలవు కావంటినా యది యాక్షేపము, పలుసారులు స్వప్నమం దీవగపడితి వంటినా దానికి సాక్ష్యములేదు, మా యొడయని ప్రాణములు నిలుపుమని ప్రార్థించితినా యది భయస్వభావము, నిన్ను రమ్మంటినా యాజ్ఞాపించుట, నీవు వలదన్నను నతఁడే వచ్చునంటినా పరాభవము, కావున నీతో నేమాట చెప్పుటకును నేరకున్నాను. నీవే ప్రమాణము. నీయిచ్చ వచ్చినట్లు చేయు" మని చెప్పి యూరకుండెను.

పిదప సరస్వతియు నధిక ప్రేమంబునఁ గను దమ్ము లింతంతలు గాఁగఁ, చెలీ! నేను జాలమాట లాడఁజాల, నవ్వుచు నొక్క పలుకుఁ బలికెద. ఈ నాప్రాణములు నీ యధీనంబులు. అనిన మాలతియుఁ బరమానుగ్రహముగల మాట యిది యొక్కటి చాలదా యని పొగడి సంతోషపరవశురాలగుచు వేగవంతంబగు వారువము నెక్కి శోణనదము దాఁటి దధీచునిం దీసికొనివచ్చుటకై చ్యవనాశ్రమమునకుం బోయె. సరస్వతియు సఖీస్నేహంబున మాలతి చెప్పిన వృత్తాంతమంతయు సావిత్రికిఁ గూడఁ దెలిపె. ఉత్కంఠాభారమును మోయుచు సంతాపపడుచున్న చిత్తముతో వాఁడు మిగిలిన పగలంతయుఁ గల్పకల్పముగాఁ గడపి ఛాయామనోహరం డస్తమించినపిదప చీఁకటి ప్రబలినవెనుక నక్షత్రము లుదయించిన పదంపడి పౌరందరదిశావలయంబు నతిధవళంబుసేయుచు గుహనుండి కేసరివలె శీతభానుండుదయించిన తరువాత చీనాంశుక సుకుమారమై చిటిపొటితరగలచేఁ గన్విందు గావించు శోణనదసైకతంబున దుకూలకోమలంబగు తల్పమునం బోలె కూర్చుండి స్వప్నంబునఁ బ్రాణనాథుని పాదంబులం బడునప్పుడు తదీయపాదనఖరకిరణకాంతి తగులుకొనె నేమోయని యూహింపఁదగిన తెల్లని లలాటకతోడను, చారుహాసినీ! నీ మగఁడిదే చనుదెంచుచున్నాఁడని మదనసందేశమును జెప్పఁ జనుదెంచెనో యనునట్లు చంద్రుఁడు ప్రతిఫలించిన గండస్థలముతోడను, నఖకాంతులు నల్గడలకుం బ్రసరించుటంజేసి చంద్రికామయమగు వాలవ్యజనము ధరించినట్లున్న చేతితోఁ జెమ్మటపట్టిన గండస్థలము విసరికొనుచు, నిందు దధీచుఁడు తప్ప రెండవవాఁడు ప్రవేశింపఁదగదని మదనుం డడ్డుగా విలాసనేత్రలతం బడవేసినట్లున్న లేఁతతామరతూఁడు స్తనములపైఁ గప్పుకొనుచు, దధీచుని రాకఁ బ్రతీక్షించుచున్నప్పుడా సరస్వతిహృదయంబున "సరస్వతినైన నాకుఁ గూడ నీచురాలికింబోలె మన్మథుండిట్టి పారవశ్యము కల్పించె నికఁ జపలచిత్తలై దీనలైన యితరస్త్రీలమాటఁ జెప్పనేల" యని యొకానొక యూహపొడమె.

తరువాత మధుమాసము వోలె సురభిగంధము వహించి, హంసపాలిక మృణాళధారియై, నెమలిలాగున ఘనప్రీతి సుముఖుండై, మలయవాయువు వసంతంబున వాహిత సరసచందనధవళిత తనులతోత్కంపుండై చందురుండు కరంబులఁ గచుగ్రిహాముఁ గావించి తీసికొనివచ్చినట్లు కందర్పోద్దీపకుండగు మలయవాయువుచేఁ బ్రేరేపింపఁబడినట్లుత్కలికాబహుళంబగు శృంగారరసము మోసికొని తీసికొనివచ్చినట్లు బయలుదేఱి శరీరసౌరభాఘ్రాణమున్మత్తమై ముసురు భసలవిసరంబు నెపంబున నీలపటము శరీరమునిండఁ గప్పుకొని ప్రథమసమాగమవైలక్ష్యంబునం బొడమిన చిఱునవ్వుచేఁ దెల్లవడినదోయనునట్లు వర్ణింపఁదగిన కపోలతలంబునఁ బ్రతిఫలించిన చంద్రబింబము లోపలనున్న వెడవింటివాని పట్టపుటేనుఁగు చెవి సంకువు ననుకరింప దధీచుండు చనుదెంచె. వచ్చి హృదయమునందున్న సరస్వతి కాలియందెల చప్పుడు కలియుటచేతం బోలె రాయంచపల్కుల ననుపదించు కంఠస్వరంబున గద్గదికదోఁప మాటలాడి మన్మథునిఁ డాజ్ఞాపించినట్లు, యౌవనముపదేశించిన పగిది ననురాగము శిక్షించినలాగున, వైదగ్ధ్యము చదువు చెప్పినచొప్పున, నభిరామయైన యా రామను సంతోషపఱచెను. సరస్వతియు నతనియందు విజ్ఞానముంచి తనయాత్మ నతనికి సమర్పించెను. పరస్పరానురాగ సంతుష్టహృదయులగు నాదంపతుల కొక్కసంవత్స మొక్కదినమువలె గతించెను.

తరువాత దైవయోగంబున సరస్వతియు గర్భవతియై సర్వలక్షణాభిరాముండగు నొక్కకుమారుం గనియె. ఆపిల్లఁడు పుట్టినతోడనే సర్వవేదంబులును సమస్తశాస్త్రంబులును సకలకలలును వచ్చునట్లు సరస్వతియె వర మొసంగెను. తరువాత భూలోకంబున మంచిమగని సంపాదించితినని పితామహునకుఁ జూపించుటకుం బోలె దధీచుని హృదయమునందు తాల్చి సావిత్రితోఁ గూడ సరస్వతియు బ్రహ్మలోకమునకుఁ జేరెను. ప్రియురాలు లేచిపోయినపిమ్మట దధీచుండును పిడుగుమొత్తినట్లు సంకటపడి భార్గవవంశసంభూతుం డగు తనభ్రాత బ్రాహ్మణునిభార్య యక్షమాలయను మునికన్యక తనకుమారునిం బెంచున ట్లేర్పాటు చేసి విరహభరపీడితుండై వనంబునకుఁ దపమాచరించుటకై పోయెను. ఏ కాలంబున సరస్వతి కొడుకుం గనెనో యప్పుడే యక్షమాలయు నొక కొమారునిం గనియె, నామె తనపుత్రునితోఁ బాటు దధీచిపుత్రునికిం గూడ స్తన్యమిచ్చి నిర్విశేషప్రేమభరంబున నయ్యిరువుర నిరువురం బోషించుచుండెనందు సరస్వతి కొడుకు సారస్వతుఁడనియు నక్షమాల కొడుకు వత్సుఁడనియునుఁ బిలువఁబడుచుండిరి. ఆసారస్వతవత్సుల కన్నదమ్ములకుంబోలె బొగడఁదగిన సౌహార్దంబులు గలిగియుండె.

దధీచితనయుండును సరస్వతీప్రసాదంబున బాల్యమంద సర్వవిద్యల నేర్చిన వయస్యుండును బ్రియసుండును స్నేహితుండును బ్రాణసమానుండు నగువత్సునకుఁ గూడ సమస్తవిద్యలు నేర్పి పెండ్లిచేసి యాప్రదేశమునందే ప్రీతికూటమను పేరు గల నివాసమేర్పఱచి కాపురం బుంచెను. తానును మోదుగకఱ్ఱయు నిఱ్ఱితోలును, నారచీరయు, జపమాలయు మౌంజియుఁ, దాల్చి వెంట్రుకలు జడలుకట్టి బ్రహ్మచర్యవ్రతము నడపుచుఁ దపస్సుచేయుచున్న తండ్రియొద్దికే చనియెను.

వర్ధమానుం డగువయ్యాదికూటస్థపురుషునివలన జనితాత్మచరణోన్నతినిర్గతప్రఘోషంబును బరమేశ్వరశిరోధృతంబును సకలకళాగమగంభీరంబును మహామునిమాన్యంబును విపక్షక్షోభదక్షంబును క్షితితలలబ్ధాయతియు నస్ఖలితప్రవృత్తంబును విపులంబును బావనంబు నగువంశం బొందు భాగీరథీప్రవాహమువలె బయలువెడలెను. వాత్స్యాయనులను పేరుగల గృహస్థులంద యావంశంబునం బొడమినవారే! ఆవాత్స్యాయనగృహస్థులు లంపటులు వేదవిహితాచారపరాయణులుఁ గపటకామవ్యాపారానభిజ్ఞులుఁ గుక్కుటవ్రతాలంబకులు బిడాలవృత్తిశూన్యులు జనవృత్తిపరిత్యాగులుఁ బరిహృతకపటకామవాదులుఁ బరిత్యక్తపాపులు న్యక్కృతనికృతులుఁ బ్రసన్నప్రకృతులు విగతవికృతులుఁ బాపవాదపరాఙ్ముఖచేతస్కులు బ్రాహ్మణేతరవర్ణత్రయసంబంధాభావపరిశుద్ధాన్నభోజనులు యథాలాభసంతృప్తధీరధిషణానిర్ధూతమూర్ఛాదైన్యులుఁ బ్రణతప్రణయవిశాలహృదయులు నిస్సంశయపరిజ్ఞాతసర్వశాఖాంతరసదాచారులుఁ గవీశ్వరులు వాచాలకులు మాత్సర్యరహితులు సరససంభాషణవ్యసనులు విదగ్ధపరిహాసచతురులుఁ బరిచయపేశలులు నృత్యగీతవాదిత్రత్రయవేదులు సమస్తేతిహాసకథారసికులు సత్యవంతులు శుద్ధశీలులు సాధుసమ్మతులు జంతుహింసాపరాఙ్ముఖులు దయాస్వభావులు సర్వసత్వస్నేహార్ద్రహృదయులు, వెయ్యేల సమస్తసుగుణోపేతులు, రాజస మెఱుఁగనివారు, శాంతిపరులు, సమాశ్రితసంతోషకులు, విగతకార్పణ్యులు, విద్యాధరులుఁ గళావంతులే కాని యజడులు నక్షత్రములవంటివారే కాని యదోషాచరులు. భాస్వంతులే కాని యనన్యతాపకులు, హుతభుక్కులే కాని యనూష్మప్రచారకులు భోగవంతులే కాని యకుసృతులు స్తంభములు లేని పుణ్యాగారంబులు సమవిచ్ఛిన్నక్రతుక్రియాకలాపవత్తులు కామజేతలు.

ఇప్పగిదిఁ దద్వంశస్థులు వృద్ధిఁజెంద సంసారచక్రము నడుచుచుండ యుగంబులు గతించుచుండఁ గాలం బతిక్రమింపసంవత్సరంబులు దాఁటిపోవ దివసంబులు నడువ సంతానపరంపరలచే విస్తరించుచున్న యావాత్స్యాయనవంశంబునం గ్రమంబుగాఁ గుబేరనామధేయుం డగుద్విజోత్తముఁ డుదయించెను. అచ్యుతుం డీశానుండు హరుండుఁ

బాశుపతుండు ననునల్వురు కుమారులు చతుర్యుగంబులవలె నారాయణచతుర్బాహుదండంబులవలె నక్కుబేరునకుం జనించి రందుఁ బాశుపతునకు భూభారముఁబోల్కి నొక్కకొడు కర్థపతి యనుమహాత్ముం డుదయమందె. కులమర్యాద లతిక్రమింపక సమస్తద్విజచూడామణియై చతురుదధిగంభీరుండై వెలయు నయ్యర్థపతి కేకాదశరుద్రులపోలికఁ బదునొకొండ్రు కుమారులు సోమామృతరసపవిత్రవదనులు భృగుండును హంసుండును శుచియుఁ గవియు మహీదత్తుండును ధర్ముండును జిత్రభానుండును జాతవేదసుండును త్ర్యక్షుండును నహిదత్తుండును విరూపాక్షుండు ననువారు సంభవించిరి. వారిలోఁ జిత్రభానుం డనుమహానుభావునకు రాజదేవి యనుబ్రాహ్మణియందు బాణుం డుదయించె. అతనికి దురదృష్టవశంబునం జిన్నతనంబుననె తల్లి గతించె. పుత్రవాత్సల్యంబునఁ దండ్రియె తల్లియై పెనుప నిజగృహంబునం బెరుఁగుచుండె. ఉపనీతుండై సమావృత్తుండై శ్రుతిస్మృతివిహితంబులైన బ్రాహ్మణోచితకర్మకలాపంబునం దుత్తీర్ణుండైన యాబాణునకుం బదునాల్గుసంవత్సరముల ప్రాయము వచ్చువాఁటికిఁ జిత్రభానుండును ముసలితనము రాకముందే కాలవశంబుం జెందె. బాణుండును దండ్రిగతించిన పిదప నాఖిలం బగుపిత్రుమరణశోకంబునం దహ్యమానహృదయుండై రాత్రిందివములు పెక్కునాళ్ళు దుఃఖించుచు నిజగృహంబుననే యుండి క్రమముగా నప్పెనువంత కొంతకొంత యుపశమించుచున్నంత స్వాతంత్ర్య మవినయమున కునికిపట్టగుటంజేసియు బాల్యము కుతూహలముల కాకరం బగుటంబట్టియు యౌవనారంభము ధైర్యమునకుం బ్రతిబంధి కావుటచేతను బెక్కు చిన్నతనపుం జెయ్వులకు లోనై స్వేచ్ఛావిహారి యయ్యెను. తనసేయు దుష్కృత్యంబులకుం గొందఱు సవయస్కులు సహాయులు కాఁజొచ్చి రందు తన తండ్రికి శూద్రస్త్రీయందు జనించిన చంద్రసేనమాత్రసేను లనపారశవులను బరమమిత్రుండును దేశభాషాకవియు నగునీశానుండును బ్రణయవంతు లగురుద్రనారాయణులును విద్వాంసు లగువారబాణవాసబాణులును వర్ణకవి యగువేణీభరతుండును బ్రాకృతకవియుఁ గులపుత్రుండు నగువాయువికారుండును స్తోత్రపాఠకు లగున నంగబాణసూచీబాణులును నేఁబదివత్సరముల ప్రాయము గలిగి యైదువయై కాషాయవస్త్రములు ధరించి కాత్యాయనిక యనిపించుకొనుచుఁ దిరుగు చక్రవాకికయు విషవైద్యుం డగుమయూరకుండును దాంబూలదాయకుం డగుచండకుండును వైద్యపుత్రుం డగుమందారకుండును బుస్తకవాచకుం డగుసుదృష్టియుఁ గంసాలి యగుచామీకరుండును వజ్రములు సానఁబట్టు సింధుషేణుండును లేఖకుం డగుగోవిందకుండును జిత్రకారుం డగువీరవర్మయు బుస్తకములుకట్టు కుమారదత్తుండును మద్దెలవాయించు జీమూతుండును

గాయకు లగు సోమిళగ్రహాదిత్యులును సైరంధ్రి యగు కురంగిక యు వాంశికు లగు మధు కర పారావతులును సంగీతోపాధ్యాయుం డగు దర్దురకుండును సంవాహిక యగు కేంలిక యు నర్తకుం డగు తాండవికుఁడును జూదరి యగు ఆఖండలుండును నటి యగు పారా శరియు బౌద్ధసన్యాసి యగు వీరదేవుండును కథకుం డగు జయసేనుండును బూజా రి వక్రఘోణుండును మంత్రిసాధకుం డగు కరాళుండును నసురవివరవ్యసని లో హితాక్షుండును ధాతువాద మెఱిఁగిన విహంగముండును గప్పకూఁతలు కూయు దామోదరుండును నైంద్రజాలికుఁ డగు చకోరాక్షుండును బరివ్రాజకుం డగు తామ్ర చూడుండును ముఖ్యులైనవారు. మఱియుం గొందఱును గలరు. ఇట్టివారం ద ఱిచే ననుదిన మనుగమ్యమానుం డగుచు బాల్యచేష్టలకు లోనై తిరుగుచు నొక్కనాఁడు కౌతుకాధీనచిత్తుం డై దేశాంతరవిలోకనేచ్ఛ జనింపఁ దనకుం బితృపితామహార్జితంబు ల గు బ్రాహ్మణోచితంబు లగు విభవంబు లున్నను తనయూర నవిచ్ఛిన్నవిద్యాప్రసంగ ము జరుగుచున్నను విడచి పరదేశమునకు లేచిపోయెను. లేచిపోయియు స్వతంత్రుం డు కావునఁ బిశాచాక్రాంతునివలె స్వేచ్ఛాచారి యగు మనం బుపదేశించినపగిదిఁ జేయు చు యౌవనమే గురువుగా మహాత్ములకు హాస్యాస్పదుం డయ్యెను.

ఇట్లు తిరిగి తిరిగి తుట్టతుదకు దైవవశంబున బహులైశ్వర్య మనుభవించు రాజ వంశంబులు జూచుచు నిరంతరవిద్యాప్రసంగము గలగురుకులంబులు సేవించుచు విలు వైన ప్రసంగము కావించు గుణవంతుల గోష్ఠులకుం జొచ్చుచు గంభీరప్రతిభాధనంబు లగు విదగ్ధమండలంబులు ప్రవేశించుచు నిజవంశోచితం బగు విద్వత్త సంపాదించి చిరకా లమునకు వాత్స్యాయనవంశీయులు కాపురం బుండు తనజన్మభూమి చూడ మనసై యా యగ్రహారంబునకు వచ్చి పూర్వబాల్యస్నేహముఁ గల్గుస్నేహితులచేతను బంధుభావ వము ప్రకటించు జ్ఞాతివర్గముచేతను నెదుర్కొనఁబడి నాఁడు గొప్పపండుగ యని సం తోషించు బంధుమిత్రబృందము నడుమ మోక్షానందమువంటి మహానంద మనుభవించెను.

ఇది శ్రీతిరుపతివేంకటేశ్వరాంధ్రీకృతం బగు హర్షచరిత్రమునం

బ్రథమోచ్ఛ్వాసము.



శ్రీరస్తు.

# హర్షచరిత్రము.

## ద్వితీయోచ్ఛ్వాసము.

క. భూపతులు దురవగాహులు, కూపములంబోలి జనులకుం గార్యంచే
లా! పటుగుణవర్ష్మటక, ప్రాపకతం గాక సిద్ధినందుఁ దనంతన్.

భస్మపుండ్రకములచేఁ దెల్లవడిన లలాటంబులు గలిగి కపిశంబు లగుశిఖలు వేలువార క్రతులోభంబున జనుదెంచిన కృశానులవలె నుండు బ్రహ్మచారులు లనవరతంబు సేయునధ్యయనధ్వనులచే ముఖరితంబులయి సోమలతలు పెంచిన కేదారంబులచేఁ బచ్చవడిన మొగసాలలయందుఁ బఱచినకృష్ణాజినంబులమీఁదఁ బురోడాశంబులకై యాఱఁబోసిన శ్యామాకతండులంబులును బాలికలచేఁ జిమ్మంబడిన నీవారబలులును పవిత్రులైనశిష్యులు తెచ్చి పడవైచిన పచ్చని దర్భాంకురంబులును నెండిన పాలాశసమిథలును నగ్నిహోత్రములందు దాపుటకై యెండఁబెట్టిన గోమయపిండంబులును నామిక్షకొఱకై పాలిచ్చు నగ్నిహోత్రధేనువుల డెక్కలచేఁ బెచ్చు లెగరఁగొట్టఁబడిన యరఁగులును కమండలువులకై మన్ను చితుకఁగొట్టుకొనుచున్న యతీశ్వరులును యజ్ఞవేదికల మీఁది శంకువులకై సంపాదింపఁబడిన మేడికొమ్మలచేఁ బవిత్రంబులగుపర్యంతప్రదేశంబులును వైశ్వదేవబలిపిండములచేఁ బాండురితంబు లగుగృహోపకంఠంబులును హవిర్ధూమంబుచే నల్లవడిన చిగుళ్లుగల పెరఁటిచెట్లును నావుదూడలను బెంచుమునిబాలకులచే లాలింపఁబడుచుఁ బఱుగు లెత్తింపఁబడుచున్న తర్ణకంబులును, బహుబంధప్రబంధములు ప్రకటించుచుఁ గ్రీడించుచున్న లేడిపిల్లలును మేకపిల్లలును నుపాధ్యాయులు శిష్యులకుం బాఠములు చెప్పుతటిఁ గొంతతడవు వారికి విశ్రాంతిసుఖ మొసఁగుశుకశారికానికరంబును గలిగి మూర్తిమంతంబు లగువేదంబులవలె నలరారు తనప్రీతికూటగ్రామంబునందలి తపోవనంబులన్నియుం జూచుచుఁ జిరకాలంబునకుం జూచిన బంధువుల నానందపఱచుచుఁ గొన్నిదినంబు లందు సుఖంబుగఁ గాలంబు గడపె.

అతఁ డచ్చటనున్న దినములలోనె వసంతఋతువు గతించుటయు గ్రీష్మఋతువు తటస్థించుటయు సంభవించె. వచ్చిన గ్రీష్మర్తురాజును గ్రొత్తగా జయింపఁబడి యస్తంగతించిన వసంతసామంతనృపాలకుని పయఃపానము సేయు చంటిబిడ్డలనంటి నవోద్యానములయందు మాత్రము స్నేహ మగపఱచుచుఁ గొంచెము మృదుత్వముఁ జూపిం

చెను గాని పురోద్యానములయందలి చెట్లకుఁ గుసుమగంధమోక్షంబుఁ గావించె కుసుమాయుధుండును గ్రీష్మమహారాజునకుఁ బరిచర్యార్థము సిద్ధము గావించిన చామరంబులవలె కామినుల శిరోరుహంబు లలంకరించె. సూర్యుఁడును దనయంతఃపురకాంతల సొగసు మాపినహిమానిపైఁ గోపంబునంబోలె హిమాచలాభిముఖం బగుప్రయాణంబుఁ గావించె.

దినకరుండును లలాటంతపంబైన వేఁడిచే వెలుంగుచుండఁ గాంతాముఖేందు లందఱును జందనలలాటికాపుండ్రకంబులు ధరించి ముంగురు లనుచీరచీవరంబులు గప్పికొని చెమటబిందువు లనుముత్యాలమాలికలు ద్రిప్పుచు సూర్యనమస్కారనియమంబులు దాల్చిరి. చందనధూసరలై సూర్యునిఁ జూడక సుందరు లందఱుఁ గల్పతీవలవలెఁ బవలంతయు నిదురింపసాగిరి. నిద్రాలసంబు లగుకామినులలోచనంబులు రత్నద్యుతినైనఁ జూడలేని యప్పుడు వేఁడివెలుంగుదేవర యెండవేఁడిమి నెట్టులు సహింపఁగలవు. చక్రవాకదంపతులచే సొంపునింపు మహానదులవలెఁ జుక్కలమిసిమిఁ గ్రుక్కారాత్రులును గృశింపసాగె. దినకరసంతాపంబువలన సకలజనులకును బరిమళవస్తుసంభారంబునం దావి గలుగఁజేసిన నీరుద్రావుటకే కాదు. గంధవహం బగువాయువుం గూడఁ. ద్రావుట కభిలాష జనింపసాగె.

ఇట్లు నిదాఘకాలంబు క్రమంబుగఁ గఠోరంబై విజృంభింపఁ జెఱువు లెండిపోయె. ప్రవాహంబులు తగ్గె. కొండకాల్వలు మందీభవించె. ఈలపురుఁగుల కూఁతలు మెండయ్యె. పల్లటీకూఁతలచే జగంబులకుం జెవుడుపుట్టె. పక్షులెల్ల నిట్టూర్పు విడువఁ దొడంగె. వాయువు కరీషంకషం బయ్యె. తీవలు విరళములయ్యె. కేసరికిశోరకంబులు రుధిరాశంకచేఁ గఠోరంబు లగుధాతకీపల్లవంబులు నాకఁ దొడంగె. ఆతపసంతాపము జెందు నేనుఁగుతండంబుల శీకరోద్గారముచే మహీధరనితంబంబు లెల్లఁ జెమ్మగిల్లఁ దొడఁగె. తుమ్మెదలు నిశ్శబ్దంబులై యేనుఁగుల మదకర్దమంబునం దాఁగఁ దొడంగె. మందారపుష్పంబులకాంతి పర్యంతప్రదేశంబుల కెల్ల సిందూరపుపూఁత పూయంజొచ్చె. మహిషంబులు సలిలప్రవాహ మనుభ్రాంతిపడి స్ఫటికశిలామయంబు లగుభూములు తమ కొమ్ములచేఁ ద్రవ్వి చిమ్మఁదొడఁగె. ఎండవేడిమిచే ఘుర్మత్తులు మర్మరధ్వని సేయఁ దొడంగె. కాఁగిన పరాగంబులందుముకనిప్పుక లనుశంకపడి కోళ్లుమొదలగు పక్షులు భయంపడఁదొడఁగె. ఏదుపందులు గుహలయందు డాఁగె. పల్వలోదకంబు లెల్ల వెలికిలఁబడినచేపలే మిగులుగాఁ గల బురదగుంటలయ్యె సరిత్తీరంబులయందలి కడిమిచెట్ల

పై లకుముకిపిట్టలు వికటంబుగాఁ గూటస్వరంబులు కూయఁ దొడంగె. రాత్రులకు రాజయక్ష్మరోగం బంకురించె. దావాగ్నులు గ్రీష్మమహారాజునకు వనదేవత లొసఁగు నీరాజనము లయ్యె.

ఊషరక్షేత్రములనుండి వచ్చుచున్నవా యనునట్లు భయంకరంబులైన వేఁడివాయువులును పానీయశాలల మీఁదికప్పు లెగరఁగొట్టుచు బండినదూలగొండతీవల సంపర్కంబునం బొడమిన దురద తీర్చుకొనుటకో యన గువ్వతాలతో నిండిన కర్కరప్రదేశంబు లొరసికొనుచుఁ బెద్దపెద్దతాటిముక్కలుఁ నలుప్రక్కలకు విసరికొట్టుచు రాల్చిన ముచుకుందపుష్పంబులును గందళప్రసూనంబులును దంతంబులవలె నలరారఁ జీరీముఖశీకరంబు లొడలుతడుపఁగఁ బకుచువాఁడగురవి యెండవేడిమికిందరళతరళంబులైన యెండమావులేటుల యనత్యజలతరంగంబులం దోలలాడుచు మర్మరధ్వని సేయు నెండిన జమ్మిచెట్లచే నిండిననిర్జలప్రదేశంబులం దెక్కువపడిగా నడువఁదగిన పిక్కబలిమి కలవై మహానటునిపోల్కి ఘూర్ణీచక్రంబుల పేరి నాట్యవిశేషము లాకసంబునం దగపఱచుచు దవాగ్నిదగ్ధంబు లగుప్రదేశంబులయందలి నల్లబూడిదచే మలినశరీరంబులై క్షపణకసిద్ధాంతమవలంబించినవారివలె మయూరపింఛంబు లూడఁదీసి ధరించుచు శింజానకరంజమంజీరజాలకంబులు ప్రయాణగుంజంబులుగా నాతిసాతిరేకంబునం దపించుచు వగరుచు నడవిమున్నపోతుల నాసారంధ్రంబులనుండి వెడలు వేఁడినిట్టూర్పులు మేలుకలుగా నిలువనీడలేక వేవేగఁ బరుగులెత్తు శేడిగుంపులు ఓడ్డలుగాఁ గుప్పకళ్లంబుల నిప్పంటుకొన్న ధాన్యపుంబొల్లురాసులనుండి వెడలు వికటధూమరేఖలు భ్రుకుటీభంగంబులుగా బిక్కటిల్లిన యుక్కసాపిచీవరకంబుగా పండఁబాఱి పగిలిన బూరుగుపండ్లనుండి యెగురుదూదిపరకలుఁ లోమంబులుగా శుష్కపత్రంబులు దద్దురులుగా నెండుగరికిపోఁచలువాళ్లుగా యవశూకశకలంబు లానందబాష్పబిందువులుగా నూడిపోయిన యేదుపంది ముండ్లు కోఱలుగా వైశ్వానరశిఖలు నాలుకలుగా ముక్తసర్పకంచుకంబులు కంచుకంబులుగాఁ జెలువార సర్వజగములయందలి సలిలము నామమాత్రావశిష్టము గావించెద నని పటపట పగులు వెదురుబొంగుల పేరి భేరికాసముదాయంబు వాయించుచుఁ ద్రిభువనంబులకును భయంకరమై వ్రాల్చిన పిచ్చుకఱెక్కలచే మార్గము లెల్లఁగప్పుచు సూర్యకాంతు లనుకొఱవులు మీఁదఁ బడినవో యనునట్లు రాలిన గులివిందపూసలు చిఱుతనిప్పుల రూపంబు వహింప గిరిగుహాలయందుం దూఱి గంభీరమగు భాంకారముతోఁ దిరుగుచు భువనంబులన్నియు బూడిదె గావించుటకై చేయు నభిచారహోమంబునకైన చరువుపచనంబు సేయుచు దావాగ్నులకుఁ బండిన వేఁపపళ్లువర్షించి పరితృప్తి సేయుచుఁ గాలిన సికతారే

ణువులు వెంటరాఁ దత్స్థలంబులందు డాఁగియున్న రాతిలక్కచే దిక్కులకెల్లఁ బూఁతఁబూయుచు దావాగ్నిచేఁ గరఁగిన పిచ్చుకగుడ్లచే మూఁతవేయఁబడిన చెట్టుతొట్టెలలోపలి కీటంబులపుటము బెట్టి కాల్చుటంజేసి వెడలిన కటుగంధము దిక్కులందెల్ల వ్యాపింపం జేయుచు విజృంభించె.

తేళ్లవలె దృణభూములయందుం దిరుగుచు ముంగిసలవలెఁ దరుకోటరంబులందుం దూఱుచుఁ గపిలమహామునులవలె జటాలంఘనము సేయుచు డేగలవలె శకునకులకులాయంబులు గూల్చుచు. నధరోష్ఠంబులవలె లాక్షాపరింబుచే నెఱ్ఱఁబడుచు వికిరంబులపోలిక పక్షిపక్షంబులు దూపి పోవుచు మోక్షముఁ జెందగోరువారివలె జన్మకారణంబులు భస్మంబు సేయుచుఁ గాముకులవలెఁ గుసుమవిసరంబులచే సురభిగంధము వహించుచుఁ గొన్నిచోట్లఁ బొగతోడను గొన్నిచోట్ల మందద్యుతితోడను గొన్నిచోట్ల జగము లన్నియు నొక్కసారి కబళింపం జాలిన పెనుమంటలతోడను విజృంభించుచుఁ గొన్నిచోట్ల బాల్యంబును గొన్నిప్రదేశంబులం దారుణ్యంబును గొన్నితావుల వార్ధక్యంబునుం జూపుచుఁ గొన్నిచోట్ల వెదురుబొంగు కొనల కెక్కుచుగొన్నియెడలఁ బర్వతములయందలి లాక్షారసము కబళించుటం జేసి క్షయరోగ మనుభవించుచుఁ గొన్నిస్థలంబుల సర్వాన్నభక్షణంబునం జేసి పీవరకళేబరంబులై కొన్నిభూముల గుగ్గులుదాహంబునఁ గావరింబులై కొన్నిపక్కల నేత్రాగ్నిదగ్ధసకుసుమశరమదనంబు లగుటం జేసి పురారిం బురణించుచుఁ గొన్నివంకల నటులవలెఁ జటులశిఖానర్తనంబుఁ జూపుచు నెండిన చెఱువులందుం బ్రవేశించి పేలాలుగాఁ జేయఁబడిన నీవారబీజంబులు దాల్చు జ్వాలాంజలులచే గ్రీష్మకాలసూర్యు నర్చించుచు నిర్దయుల పోలికఁ గాల్పఁబడిన మెట్టతాబేలుల వసాదుర్గంధము నాఘ్రాణించుచు శత్రువు లగు మేఘములను సృజించు ననుభయంబునం బోలె తనుపాగను దామే భక్షించుచు తృణప్రాయప్రదేశములందు సలిలాహుతుల పోలిక స్ఫుటద్బహుళబాలకీటఁబులై శుష్కసరసులందు వత్తుగుల్లలు కాల్చుటంజేసి శ్విత్రివంతులం బోలుచు తేనెపట్లనుండి మధుబిందువు లోడ్చుటం జేసి చెమటబట్టినవారిం బోలుచు పర్యంతిశీర్యమాణశిఖాసంపాతు లగుటంజేసి బట్టతలవారిం బురణించుచు సూర్యకాంతమణులను మండించుటం జేసి శిలాకబళనంబు సేయువారి వలెఁ జెలరేఁగుచు దారుణంబు లగు దావాగ్నులె చ్చటఁ జూచినఁ దామై విజృంభింపఁ దొడఁగె.

అట్టిమహాగ్రీష్మకాలంబున భానుండు భోజనముఁ జేసి తనయింటఁ గూర్చున్నయప్పు డపరాహ్ణసమయంబున పారశస్త్రభ్రాత యగు చంద్రసేనుండు చనుదెంచి

యిట్లనియె అయ్యా! చతుస్సముద్రముద్రిత ధరాధిపతియు దేవదేవుండును నెల్ల రాజుల తలలమీఁది రత్నంపుసానలపై యొరపిడుచున్న చరణనఖరమణులు కలవాఁడును సర్వచక్రవర్తులకు ధౌరేయుండును మహారాజాధిరాజరాజపరమేశ్వరుండు నగు శ్రీహర్షదేవుని యన్నయగు కృష్ణభూపతి తమ సమీపంబున కొక తెలివి గల దూతనంపించె నతండు చాల దూరము నడచి వచ్చుటంజేసి యలసి ద్వారమం దున్నవాఁడనిన నతండు నాయుష్మంతుఁడా? వేవేఁ బ్రవేశపెట్టు మని సెలవిచ్చినఁ జంద్రసేనుండునువానిం దోడ్కొని వచ్చె.

మిగుల దూరము నడుచుటంజేసి మోటవారిన పిక్కలును గుడ్డచీలిక లతికికుట్టిన చండాతకమునిండఁ బడిన బురదయును వీపుపై వ్రేలాడు చిరుగుధోవతిముడియును దారము లంటగట్టుటంజేసి వడుమ నలిగి రెండుగాఁ గప్పట్టుచున్న తలమీది లిపిపట్టంబును గలిగిన యామేఖలకుం దూరమునందు జూచి "యోరీ! భద్రుడ సమస్తభువననిష్కారణబాంధవుండగు కృష్ణభూపతికి భద్రమా" యని యడిగిన వాడును భద్రమే యని బదులుచెప్పి నమస్కరించి కొంచెము దూరమునంద కూర్చుండి మార్గశ్రమంబు బాపుకొని "యయ్యా! మాస్వామి పూజ్యుండవగు నీకడ కనిపిన యుత్తరమిదె చూచుకొండని విప్పి చేతికందిచ్చెను. పిదప భాణుండును నత్యాదరముతోఁ గమ్మఁగైకొని స్వయముగా చదివినతరువాత మేఖలకునివలన కాలాతిపాతము ఫలప్రతిబంధకము కావున దానిం బండితులు పరిహరించునది" యను వాక్యమే యిందు ముఖ్యాంశము తక్కినయది "క్షేమప్రతిపాదక" మను వాచికముఁగూడ విని లేఖార్థమంతయు నిశ్చయించుకొని పరిజనము నావలకుం బొమ్మని నియమించి మేఖలకుని మరల నడిగిన వాడు నిట్లనియె.
దేవా! మాస్వామి బుద్ధిమంతులగు తమకిట్లు విన్నవింపుమనియె లోకపూజ్యులగు మీకుఁ దెలియని యంశముండదు గాని యొకగోత్రంబునం బొడముట. యొక్కవర్ణంబు వారగుట, యొక్కచో బెరుగుట. నొక్కచో నివసించుట పలుమరుఁ జూచుచుండుట యొకరిగొప్పయొకరువినుట సమానస్వభావము గలుగుట పరోపకారబుద్ధియుండుట యివియే స్నేహమునకుఁ గారణములు. ఏతాదృశకారణ మొకండును లేకపోయినను మిమ్మెన్నడు నేను చూడకపోయినను సర్వదా సమీపమునందున్న బాంధవునందుఁబోలె మీయందును నాహృదయము పక్షపాతము వహించి మీస్నేహమును గోరుచున్నది. దూరమందున్నను జంద్రునకుఁ గుముదాకరంబునందుఁ బ్రేమయుండుట సహజమేకదా. దుర్జనులు కొందఱు మాచక్రవర్తిసన్నిధిం దమకిష్టమై వేఱొక విధముగా విన్నవించిరి. మహారాజును వారిమాటలు నమ్మకయే యున్నాడు. ఎటువంటి సజ్జనులకును మిత్రులు

శత్రులును నుదాసీనులును గలరు. బాల్యచాపల్యమునాఁటి తమవృత్తాంతము నెవ్వఁడో యోర్వలేనివాఁడు కొంచె మెచ్చుతగ్గుగాఁ జెప్పను. ఇతరులు నది యట్టిదియేయని వెంటఁ దాళము వైతురు. అవివేకులచిత్తవృత్తులు సలిలములవలె నీచానుగతంబులై లోలంబు లగు. పదిమంది యొక్కరీతిగాఁ జెవికి సుఖకరమగునట్లు చెప్పఁగా వినునే గాని రాజుమాత్రి మందలి సత్యాసత్యము లెట్లు గుర్తింపఁగలఁడు? యథార్థ మెఱింగిన మేము దూరమం దున్నను నీవు దగ్గఱ నున్నట్లె భావించుచున్నారము. చక్రవర్తితో వారి బాల్యచేష్టలకు బాల్యమే యపరాధి గాని వారు కారని విన్నవించితిమి. ప్రభువును మా మాటలు విశ్వసించెఁ గావున మీరు కాలక్షేపము సేయకుండ మాచక్రవర్తి దర్శనమునకై రావలయును. మీరు సర్వదా బంధువులనడుమ నివసించియున్నను మారాజుం జూడనిచోఁ బువ్వులు పండ్లును లేని చెట్టువంటివా రని నానమ్మకము. సేవ మిగుల విషాదకరమనియు నందు రాజోపసర్పణము మఱియు భయంకరమనియు మీరు తలంపకుండునది.

గీ. ఇచ్చమెయివచ్చు విషయంబులే నొసంగ, రెపుడు మార్గణశతదుఃఖమిచ్చుచుండ్రు
మోహమున జీవనముఁగూడ ముంత్రు దర్ప, కుండు నీశ్వరమూర్తి దగ్ధుండు జగతి.

లోకమునం దారాజులు వేలు. మాచక్రవర్తి యద్భుతమయుండు. నృగ నల నిషధ నహుషాంబరీష దశరథ దిలీప నాభాగ భరత భగీరథ యయాతిప్రముఖులం బోలినవాఁడు. మాచక్రవర్తిదృష్టి అహంకార మనుకాలకూటవిషమును గ్రక్కునవి కావు. వాక్కులు గర్వరోగగద్గదంబులు గావు. వ్యాపారము లతిగర్వ మనుమూర్ఛారోగమువలన మఱచిపోవునవి గావు. అతిదర్పబాహుజ్వరంబునఁ గలిగిన వికారంబు లతనికి లేవు అభిమానసన్నిపాతరోగ మంకురింపదు. అతని సంభాషితములయందు మదమత్తతచే వక్రింబులును నిష్ఠురంబులు నైనయక్షరంబులే యుండవు. అతనికి రత్నబుద్ధి సజ్జనులయంద కాని శిలాశకలంబులయందు లేదు. ముక్తాధవళంబు లగు గుణములు గలిగియుండుటే కాని యాభరణములు గలిగియుండుట యతనికనిష్టము. శ్రేష్ఠ దానవంతంబు లగుకర్మములయంద కాని కరికరటంబులందు లేదు. మహాప్రీతి సత్యాగ్రేసరం బగు కీర్తియంద కాని జీర్ణతృణమువంటి జీవితమందు లేదు. అలంకారచికీర్ష గృహీతకరంబు లగుదిక్కులందే కాని చర్మపుత్రికలవంటి భార్యలయందు లేదు. గుణవంతం బగుధనుస్సే యతనికి సహాయము గాని పిండమునకై చేరినసేవకులు గారు. మఱియు నతనియాత్మ మిత్త్రులకును ప్రభుత్వము భృత్యులకును వైదగ్ధ్యము పండితులకును రాజ్యలక్ష్మి బాంధవులకును నైశ్వర్యము పరిజనులకును సర్వస్వము బ్రాహ్మణులకును

హృదయము సుకృతచేష్టలకును నాయువు ధర్మంబునకును శరీరము సాహసంబునకును బుద్ధి కీర్తికిని రాజకులము వినోదమునకును బ్రతిపక్షసముదాయము ప్రతాపంబునకు నుపయోగించునది. వెయ్యేల సర్వాతిశాయి యగుసుఖము గలిగించు నరేంద్రపాదపల్లవచ్ఛాయ సామాన్యపుణ్యములు చేసినవారికి దొరకదు. అనిచెప్పిన విని బాణుండును భటుని సుఖభోజనశయనాదు లేర్పఱుచుటకై చంద్రసేనునే నియమించెను.

అట్లా భటునిం బంపించిన వెనుకఁ బ్రొద్దు వ్రాలె. కాకిపిల్లవంటి రంగు గల బాలాతపంబును ముకుళించుచున్న తమ్మిమొగ్గలు కబళించినట్లు క్రమముగాఁ దగ్గనశించి పోసాగెను. అనూరుండు హరిదశ్వంబులపగ్గంబులు బిగింపఁ గమలినీకాముకుండును దేవుఁ డగ్గి యస్తాద్రిశిలావిషమప్రదేశములం దొట్రుపడుచుఁ గమలినీకంటకంబులచేఁ బాదంబులు గీసికొనిపోవ ముందరకుం బోరగిలఁ బడియెను. అంధకారవేళలం బాలకం బగుశ్యామముఖంబు శశివిరహశోకంబునం బోలె నల్లపడియె. అట్టిసమయంబున బాణుండును సంధ్య నుపాసించి యేకాకియై తల్పంబునం బరుండి యిట్లు యోజింపఁ దొడఁగె. ఇప్పుడు నేను జేయఁదగిన దేది? రాజు నాయం దన్యథాబుద్ధి కలవాఁడు. నిష్కారణబాంధవుం డగుకృష్ణుండు రమ్మని నాకు వార్త నంపెను. రాజకులమా యతిగంభీరమైనది. భృత్యత్వమా యతివిషమమైనది. రాజసేవయా మిగులఁ గష్టమైనది. ఇంతకు మున్ను మాపూర్వులయినను రాజానుగ్రహము సంపాదించినవారు కారు. రాజాగారమునకు రాకపోకలా లేవు. నావలన నుపకార మేదియును లేదు. బాల్యస్నేహమైనను లేదు. గోత్రగౌరవమయినను లేదు. ఇంతకుముం దన్నఁడును జూచియైన నుండలేదు. ప్రజ్ఞాప్రలోభనమా యెఱుఁగను. విద్యాతిశయకుతూహలమా లేదు. ఆదరము పుట్టించు సౌందర్యమా లేదు. కల్లబొల్లిమాటలు నాలుగు చెప్పుటయేనిం జేతకాదు. విద్వద్గోష్ఠియందలి నేర్పుమా లేదు. వశీకృతి కయి వెచ్చింపఁదగిన ద్రవ్యమా లేదు. రాజవల్లభులతోడిపరిచయమా లేదు. పోక తీరదు. సర్వలోకగురుండును భగవంతుండు నగుపురారియే నాకు సర్వప్రకారంబుల శుభంబు లొడఁగూర్పవలయు. అని యాలోచించి హర్షదేవదర్శనమునకై పోవుటకు నిశ్చయించుకొని నిద్రించె.

మఱునాఁ డుదయమున లేచి కృతకృత్యుండై స్నానము గావించి తెల్లనిదుకూలంబులు ధరించి జపమాల కేలం గొని ప్రయాణసమయంబునఁ బఠింపఁ దగినసూక్తంబులు పలుమాఱు పఠించి మహాదేవునకు క్షీరాభిషేకపురస్సరంబుగా షోడశోపచారంబులు గావించి ముందుగా హోమము చేయఁబడిన నువ్వుగింజలు పెటపెటలాడ ఘృతాహుతులచే దక్షిణజ్వాలగా నుండుచున్నహుతాశనుని వేల్చి బంగారము పంచిపెట్టి హోమ

ధేనుప్రదానముం బ్రదక్షిణ మాచరించి మంచిగంధ మలందికొని తెల్లనిబట్టలును బువుఁదండ లును దాల్చి గోరోచన మద్దిననగరికపోఁచకుం గ్రుచ్చినకొండగోఁగుపూవులు చెవిఁగొనం ధరించి తన్నుం దల్లికంటె నెక్కుడుగాఁ బ్రేమించిన గతభర్తృక యగు చిన్నమేన యత్త మాలతి యనునామె గమనమంగళంబు లన్నియు నాపాదింప వృద్ధబాంధవు లాశీర్వదింప ముదుసలిపరిచారకు లభినందింప గురువులకు నమస్కరించి వారిసెలవు నొంది కులవృద్ధులు శిరంబు మూర్కొన గమనోత్సాహము రెట్టించుశకునంబులకు సంతసించుచు మౌహూర్తికమతంబున నక్షత్రదోహద మాచరించి శోభనం బగుముహూర్తంబునం గోమయోపలిప్తమై ముగ్గు లలంకరించిన భవనాంగణంబునం దుఁడి మొదనిండఁ వల్లనివి తప్పఁ దక్కినయెల్లరంగులపువ్వుదండలును జుట్టి ముఖంబునఁ మావిడిచిగుళ్లుంచి పిష్టపంచాంగుళములచేఁ దెల్లపఱచిన పూర్ణకలశముం జూచుచుఁ గులదేవతలకుం బ్రణమిల్లి ఫలపుష్పపాణులై తనగమనానుకూల్యంబునకై జపించు కులద్విజులు వెంట రాఁ గుడికాలు ముందు కదల్చి ప్రీతికూటగ్రామంబునుండి బయలుదేరెను.

ఇట్లు కదలి వేసంగికాలమున నుదకరాహిత్యంబును మ్రోడులైన చెట్లును గలుగుటంజేసి కష్టతరంబై బాటసారులకుం దూరమై మధ్యప్రదేశంబునం గలచెట్లు మొదటఁ జెక్కినదశభుజయగు కాత్యాయనీవిగ్రహంబు సర్వజన భయంకరం బై ప్రకాశింప శుష్కంబయ్యు దప్పిగొన్న శ్వాపదమృగంబుల నోట వ్రేలాడు నాలుకలచే బల్లవితంబయినట్లు ఎలుఁగులును గొండముచ్చులును దనెగోరిలటకై తేనెపట్లు పడలాగ నందుండి పరుగులెత్తు తొండలచేఁ బులకితంబైనట్లు దావాగ్నిదగ్ధప్రదేశంబుల స్థూలస్థూలంబుగా మొలకలెత్తిన శతావరీకందలంబులచే రోమాంచితం బయినట్లు నొలయు చండికాకాననంబు దాఁటి నల్లకూటం బను గ్రామంబుఁ జేరి యందు మానస్సులేకమైనస్నేహితుఁడు జగత్పతి యనువాఁడు తగినసపర్య గావింప సుఖంబుండి యాదినంబు గడపి మఱునాఁటిప్రాతఃకాలంబున వెడలి భగవతియగు భాగీరథిం దాఁటి యుష్టిగ్రహంబను పేరుగల యడవియూర నానాఁటిరాత్రి వసించి మూఁడవదినంబున నచిరవతీనది తీరంబునందలి మణితారపురమునకు దాపుననున్న స్కంధావారముఁ జేరి రాజభవనంబునకు నాతిదూరంబునందలి యొకయింటం బ్రవేశించెను.

అందు స్నానభోజనాదికము నిర్వర్తించి కొంతతడవు విశ్రమించి మార్గాయాసముం దీర్చుకొని జాముప్రొద్దుండఁగా మేఖలకునితోఁ గూడ బయలుదేఱి నడుమనడుమ రాజుల శిబిరంబులు గాంచుచుఁ జనిచని యంబారీ వేయుటకుం గొన్నియు భేరీవహనంబునకుం గొన్నియుఁ గొత్తగాఁ బట్టుకొనఁబడినవి కొన్నియు బన్నకొలకుఁ

బుచ్చుకొన్నవి కొన్నియు నైపుణ్యముం గనఁబఱచుటకుం గొన్నియు నేనుఁగులు పుట్టుపుడమిం బాలించువారు పంపినవి కొన్నియు నడపిబోయెడెం దలఁచినవి కొన్నియు రాజులు ప్రథమదర్శనంబునఁ గానికకై కొనితెచ్చినవి కొన్నియు మఱికొందఱు రాజులు దూతలతోఁ గూడఁ బంపినవి కొన్నియు యుద్ధక్రీడ చూపించుటకై కొన్నియు దానంబులకై కొన్నియు వాహ్యాళి నడిపించి తీసికొనిరాఁబడినవి కొన్నియు వాహ్యాళికై ముఖ్యవాహనంబులు కొన్నియు గంటలకొట్టుటకై నిల్పఁబడినవి కొన్నియు నేనంగు లేకమై సేతుబంధనార్థమై ప్రోగుచేయఁబడిన పర్వతములవలె నొకచోఁ బ్రకాశింపఁ గెల్లపుమఁ గదల్చు గాలిడెక్కలపటపటాత్కారంబు రాజ్యలక్ష్మి నాట్యంబు చేయించుటకై వాయించు మద్దెలమ్రోఁత గాఁగఁ బెలవులనుండి జాఱునురుఁగుప్రోగులు హరిణజాతింగూడ జవజడజంఘంబు లని పరిహసించు నవ్వు గాఁగ హేషారవంబు లుచ్చైశ్శ్రవంబుం బోరాటమునకై పిలుచు కేకలు గాఁగ గాలిచే నిట్టట్టు కదలు శిరోమండనచామరంబులు రవిరథతురంగంబులమీఁది కెగిరిపడుటకై కట్టుకొనిన ఱెక్కలు గాఁగఁ గన్పించు గావించుతురంగంబులు తరంగంబులపోలిక నింకొకచోటఁ మత్తొకప్రదేశంబునం దిన్నిన్ని యోజనంబులు నడువఁగల వని తెల్పుటకు వ్రాసినయక్షరములో యనఁ దనరు గవ్వదండలు ముఖమండనములు గా రక్తక్షుద్రచామరంబులు కర్ణపూరంబు లగురక్తోత్పలంబులు గా ఘణఘణయనియు ఘుమఘుమయనియు మ్రోగు కృత్రిమచామీకరగోళవమాలికలచే రణద్విజపూరశోభితంబు లగుముదుమతమిత్రకోటల ను భ్రాంతిపుట్టించుచు శ్రవణప్రాంతంబులందుం బ్రకాశించు వైదుర్యంగుల యున్నతాగ్రిమ్ము జటాజూటంబులవలె వలరారి నట్టెట్టుఁ దిరుగు కపికపోలకపిలంబు లగులొట్టిపిట్టలును నింకొకచోట శరత్కాలమేఘంబులవలెఁ బ్రసృతపయఃపూరంబులును ధవళతరశరీరంబులు నైఁ కల్పవృక్షంబులపోలిక ముక్తాఫలజాలకమాలికాలోకవిలుప్తచ్ఛాయామండలంబు లై వారాయణనాభిపద్మంబువనువున సమాశ్లిష్టగరుత్పక్షంబు లై శేషఫణిఫణాఫలకంబులరీతి నుపరిభాగద్యోతమానస్థూలమాణిక్యఖండంబు లై గంగాపులినంబులచాడ్పు రాజహంససేవితంబు లై గిరిపక్షంబులవుం దిరస్కరించుచున్నట్లు సూర్యప్రతాపమును నవ్వుచున్న ట్లాతపమును మ్రింగుచున్నట్లు జీవలోకమంతయుఁ జంద్రలోకమయముఁ గావించుచుఁ గాలమెల్ల గుముదమయముఁ జేయుచు బలమంతయు జంద్రికామయ మొనర్చుచు ! వాకినమెల్ల ఫేనమయము నాపాదించుచు నకాలకౌముదీసహస్రములు సృజించుచు దేవేంద్రలక్ష్మిం బరిహసించు శ్వేతాతపత్రంబులును దశదిశావలయంబును క్షణదృష్టనష్టంబుగా ముల్లోకములను మ్రింగుచున్నట్లును నుత్పాతక్షేపకాలంబు లంధకా

రాలోకనయంబు లగుటం జేసి దివసంబునే రాకపోకలు చేయించుచున్నట్లును నృపకళంకమలినం బగుకలికాలస్థితి నుద్వాసన చేయించుచున్నట్లు లోకంబునం గాశప్రసూనధవళదివం బగున కాలశరత్కాలముం గలిగించుచున్నట్లు నక్షత్రమార్గంబునం బిసతంతువులు చిమ్ముచున్నట్లు వెలయు శశికిరణధవళంబులగు చలచ్చామరసహస్రంబులును గలిగి కరికర్ణశంఖంబులు రాయంచగుంపు లై కదళీవృక్షంబులు కల్పలత లై మయూరాతపత్రంబులు మాణిక్యవృక్షకాననంబు లై యంశుకంబులు మందాకినీప్రవాహమై పట్టుంబుట్టంబులు పాలసంద్రంబై మరకతమయూఖంబులు కదళీవృక్షంబు లై వెలయఁ బద్మరాగబాలాతపంబు లింకొక్కపవలును నింద్రనీలద్యుతు లింకొకయాకసంబును మహానీలమయూఖంబు లింకొక్కయపూర్వం బగురాత్రియు గారుడమణిప్రతానంబు లింకొకకాళిందీప్రవాహంబును సృజింపఁ బుష్యరాగంబు లంగారఖండంబు లనఁ భ్రాంతిం గలిగింప మహారాజవర్శనంబు వోరకకి తలలువాంచి శాలిగోకులంబు మొగంబులు ప్రతిఫలించుటం జేసి సిగ్గుచేఁ దమతిలలు తమయువయువములయందు దాఁచుకొనుచున్నట్లున్నవారును జేయునదిలేక యేమియుం దోఁచక పదనఖంబులచే ధరాతలంబుమీటుచున్నతఱి నిట్టటుప్రసరించు నఖకాంతియను నెపంబున సేవాచామరంబులు విసరుచున్నట్లున్నవారును సాత్మ్యపాత్యఁ గావించుకొనఁబోయిన రాజానుగ్రహము కలుగునని తలంచి యురంబునందుయ్యాల లూఁగు వేల్పురాటాతి దండల మిసిమి నెపంబునం దరివారుల కంఠంబునం దాల్చుకొనుచున్నట్లున్నవారును నిట్టూర్పుగాలివాసన కై మూఁగు తుమ్మెదలచే మొగంబు లమావసరేలు గాఁగ రాజ్యనాశభవం బగుశోకంబున గడ్డంబులు పెంచుకొనినవారివలె నున్నవారును శిరోమాలికలపై దిరుగు గండుఁదుమ్మెదలు ప్రణామావమానంబునకుం జడిసి పాఱిపోవు తలలవలె నలర నిర్జితులయ్యును సమున్నతులవలె ననన్యశరణులై యున్నవారును నడుమనడుమ బైటకు వచ్చుచు లోపలికిం బోవుచు వెంటనంటివచ్చు యాచకపాళిం గసరుచున్న యంతరద్వారపాలకుల విసుకు లేక మాటిమాటికి "భద్రులారా! పరమేశ్వరుని దర్శన మిప్పుడగునా! లేక భోజనమైన పిదప దర్శన మిత్తురా! వాహ్యాళికై యిప్పుడ వత్తు" రని యడుగుచు దర్శనాశచేఁ గాలముఁ బుచ్చువారు నగు నిర్జితానేకనృపాలకమండలంబులును నానాదేశములనుండి ప్రతాపాభిలాషం జేసి వచ్చి నరపతిదర్శనముం బ్రతీక్షించుచున్న యితరరాజకుమారులును నేకాంతప్రదేశములయం దున్న జైనులు బౌద్ధులు పాశుపతులుఁ బారాశరులును బ్రాహ్మణులును మఱియు సర్వదేశములనుండి వచ్చిన జానపదులును జతుస్సముద్రవేలావనవాసులును సర్వదేశాగతు లగుమ్లేచ్ఛులును దూతలును దమతమ యుచితస్థానంబులం

డుంపఁ బ్రజాపతుల సర్వప్రజానిర్మాణభూమి యన లోకత్రయసారరచితం బగు
చాతుర్య మన నహానికృతయుగముల సమావేశ మన నర్బుదపరిమాణంబులగుస్వర్ణంబు
ల నన్నిపాతిం బనఁ గోట్లకొలఁది రాజ్యలక్ష్ములకు నృత్యమంటపం బైనవాగ్రమహాభా
రతంబు వైనను వచింపరాని మహారామణీయకంబు గల రాజద్వారంబుం బ్రవేశించెను.

పిదపఁ బదార్థమణీయకవిలోకనంబున విస్మయపరవశుం డయిన యీబాణమ
హాకవిహృదయంబున నింతటిమహాసంఖ్య గలప్రాణిజాతము సృజించిన సృష్టికర్తలు
మనంబున మహాభూతిపరిక్షయ మగునని యేల తలంపలేదో! పరమాణుపరిచ్ఛేద మగున
ని యేలాలోచింపలేదో! కాలమున కంతము వచ్చునని యేల యోజింపలేదో! వారి
యాయుర్దాయంబునకు సమాప్తి యేల కాలేదో! వారియాకృతికి సమాప్తి యేల కాలేదో
యను మహాసంశయము మునుఁ దోఁచెను. మేఖలకుండును దూరమునం దుండియే
ద్వారపాలకులచే గుర్తింపఁబడి యాపుణ్యాత్మ! క్షణకాల మిం దుండు మని బా
ణునినిలిపి యప్రతిహతగమనుం డై పురములోనికిం బ్రవేశించెను. తరువాత మహా
తేజఃకాలంబునను గిణికారిగౌరం బై తెల్లని కంచుకముచేఁ గప్పఁబడిన యున్నతం
బగుశరీరంబును మాణిక్యమయం బగుపతకబంధంబుచే బిగింపఁబడిన సన్నని నడుము
హిమశైలశిలావిశాలం బగువక్షస్స్థలంబును మంచుఁగొండపెండ్లికొడుకు గిత్తమూఁపురము వ
లె వికటోన్నతంబు లగునంసంబులును వలంబు లగునింద్రియకురంగంబులం బట్టుట
కొగ్గిన యురిత్రాళ్ళన నొప్పుముక్తాహారంబులును సేతాద్వశభూపతిలలామంబు తనత
నవంశంబునం బొడమినవాఁ డేమో యనియడుగుటకై శ్రవణంబుల నవలంబించిన సో
మసూర్యులో యన వెలయు మాణిక్యకుండలంబులును వికచపుండరీకముండమాలికవలె
దూరంబుననుండియే లోకము నానందపఱుచు దీర్ఘదృష్టిపాతంబును స్థైర్యంబున
కధిష్ఠానం బగుచోటనుండియు వినయముం జూపించు మౌళియందున్న తెల్లనితలపాగ
యుం గలిగి వామకరంబున ముత్యాలతాపడంబున దంతురితం బగు పిడిగలకృపాణంబు
ను నితరకరంబున సువర్ణమయం బగువేత్రయష్టియు దాల్చిన యొకానొక పురుషుండు
వెంటరా మేఖలకుండు మరలఁ జనుదెంచి యితఁడు దౌవారికులలో నగ్రగణ్యుండు మ
హారాజున కతిప్రియుండు పేరు పారియాత్రికుం డితనిం దగినప్రతిపత్తిచే గౌర
వింపుఁడు మీకు సమస్తశుభములు చేకూరు ననియె. పిదపఁ బారియాత్రికుండును సమీ
పించి నమస్కరించి మధురవాక్యంబుల వినయం బుట్టిపడ దయచేయుఁడు ప్రవేశింపుఁ
డు దర్శనమిచ్చుటకు సన్నద్ధుం డై మహారాజున్నవాఁ డనవుడు బాణుండును ధన్యం

జ నైతి మహారాజునకు నాయం దింతటి యనుగ్రహంబు వచ్చెనని సంతసించుచు నతండు దారి తెలుప నభ్యంతరమునం బ్రవేశించెను.

తరువాత నాకిట్టివనాయు కాంభోజ భారద్వాజ పారసీక సింధు ప్రముఖంబు లగుదేశంబులం బొడమినవియు నెఱుపు నలుపు తెలుపు పసుపు పైంగల్యము తిత్తిరి పక్షిచ్ఛాయము మొదలగురంగులు కలవియు డెక్కలు వాలిగింటను మొగనుఁదును తెల్లనిమచ్చలు కలుగుటంజేసి పంచభద్రంబు లనఁబడునవియు మల్లికాక్షంబులును శరీరమునిండఁ జుక్కలవంటి తెల్లనిచుక్క లుండుటంజేసి కృత్తికాపింజరంబు లనఁబడునవియుఁ గండలేని పొడుగుపాటి ముఖంబులును నతివిశాలంబులుఁ గాక నిక్కపొడుచుకొని యున్న కర్ణకోశంబులును వర్తులంబులై సునుటితంబులైన చిక్కని సిగాలప్రదేశంబులును యూపస్తంభమువలె వక్రింపై పొడ్వుగన కంఠంబును నుపచయంబుగా బలిసిన స్కంధంబులును లోనికి దించికొని పోక పైకిఁ దేలియున్న యురస్స్థలంబును పలుచనై తిన్ననైన వాలుకయు నిమంపగుండ్లవలెఁ గఠినంబులగు డెక్కలును నతివేగంబుగా నడుచునప్పుడు తెగిపోవునను భయంబున వాళ్లు లేకుండగనే వర్తులంబులు గా స్పృశింపఁబడినవో యన్నట్లున్న యుదరంబులును ద్రోణికామాంసలంబులై వెలుపడియున్న నితంబంబులును బుడమియుంచం దొర్లాడు వాలంబులును మొదలగు శుభలక్షణలక్షితంబు లగువయసంబులు కలవియు రెండప్రక్కలను దృఢతరంబు లగు భర్మపాశంబులు బిగించి కుంచించుటంజేసి పొడవు తగ్గినను బాశబంధంబుచే నొక కాలు ముందుకుఁ జాఁచి యుండుటఁ దగ్గనియట్లే కాన్పించునవియు రెండుమూఁడు పేటలతోఁ జేసిన త్రాళ్లు తగిల్చిన కంధరంబులును నిమీలితంబు లగులోచనంబులును గలిగి నములుచున్న గటికిపోఁచలరసముచే శ్యామలంబు లగునురఁగుముద్దలు డాడలినిండఁ బడ దురదచేఁ బురపురలాడు కాయంబు దంతములచే మాటిమాటికిఁ గొఱికికొనుచు నలసాలసంబుగా వాలాగ్రప్రదేశంబు కదల్చునవియు నొక్కడెక్కపై నిలిచి నిద్రించుటంబట్టి శిథిలితంబులగు జఘనార్ధంబులతో నేదియో ధ్యానించుచు నడుమనడుమ హుంకరించుచున్నవియు ఖనఖనలాడు ఖురాగ్రములచేఁ బుడమి వ్రచ్చునవియు ఘాస మభిలషించునవియు యవనిగ్రాసంబు నర్ధాసలమున జిమ్ముచు క్షోభించునవియు స్వరక్షకు లగుచండాలుర కోపహుంకారములకుం జడిసి వల్లగ్రుల్లాడించునవియు గుంకుమ ప్రమార్జనంబునఁ బింజరాంగంబు లగుటంజేసి సర్వకాలసన్నిహితంబు లగునీరాజనంబులచే రక్షింపఁబడుచున్నట్లున్నవియు వితతవితానంబులును బురఃపూజితాభిమతదేవతంబులును భూపాలవల్లభంబు లగుకట్టములచే సుందరం బగుమందుర విలోకించుచుఁ గుతూహలంబు హృద

యౌవనం దంకురింపఁ గొంచె మంతరముఁ గడచి యెడమవైపున నత్యున్నతం బగుచు
చే నాకరమెల్ల నిరవకాశముఁ జేయుచున్న యరఁటితోఁట చుట్టుప్రాకారయై రహిం
పఁ దుమ్మెదలచే నిండిన కరిమదంబు నదులవలెఁ బ్రవహింప సుందరంబగు క్రీడావా
స్తినివాసంబగుమందిరంబు వికసించినపొగడపూవుందావివంటి తావి ఘ్రాణేంద్రియమా
ఘ్రాణింపఁ గనుంగొని మహారా జెందు బాయేమి యని యాదౌవారికు నడి
గిన నతండును, మహాత్మా! యందుమహారాజునకు బహిఃప్రాణంబును శౌర్యం బగు
హృదయంబును జాత్యంతరంబగుచాత్మయు పక్రిమంబునకు మిత్రంబును దర్పశాతనా
మంబు నగుక్రీడాగజంబు వసించియుండునని చెప్పినబాణుండును, భద్రా! దర్పశా
తమును నేను వినియున్నాను తప్పు గాదేని జూడవలయు నని యున్నది. కావున న
న్నచటికిం గొంపొమ్ము కొంపోయి నాకుతూహలముం దీర్పు మనవుడు దౌవారికుం
డును గానిమ్ము తప్పేమి దయచేయుఁ డావారణేంద్రముం గనుఁడు మీకుతూహలముం
దీర్చుకొనుఁ డని బదులు చెప్పెను.

పదంపడి బాణుండును దత్ప్రదేశంబునకుం బోయి యాకసంబునఁ జాతకపక్షు
లకును భూమియందు నీలకంఠంబులకును గ్రీంకారకేకారవంబులకలకలంబు కలిగింపం
జాలు గంభీరబృంహితారావంబు దెసలువ్రక్కలుసేయ విచ్చిన కడిమిపూవులతావిలోఁ
బోరాడుటకును సురాసౌరభంబుతో డీకొనుటకును జాలిన మదపరిమళంబు భువనంబు
లాక్రమింప మధుబిందుపింగళంబులై పద్మాకరంబు లగుమదజలబిందువులచే సరస్సుం
బోలు శరీరంబు చతుర్థకుడావస్థం దెలుపఁ గర్ణతాళతాడితంబు లగునవతంసశంఖంబులవ
లనఁ బొడసూపు చప్పుడుం పంచమదావస్థాప్రవేశోత్సవంబు నాఁటి మంగళగానంబు గాఁ
గ చెల్లపుడుఁ గదలుటంజేసి మ్రోగు కాలిగొలుసులఘళఘళారావంబు లయగా నుయ్యా
లయూఁగుచున్న ట్లున్న దీర్ఘకాయంబు భారమంతయు మోపిన నేలక్రుంగుననిభ
యంబువంబోలెఁ దేలికపడున ట్లగుపింప దిగ్గజంబుల యుద్ధంబునకుం బిలుచుచున్నదో
యనఁ గొండ మెత్తుచు దిశాభిత్తికలం దేవాకండూతి తీర్చుకొనుటకుం బోలె నట్టిట్టుఁ
గదలుచు బ్రహ్మస్తంభంబు చీరుటకుంబోలె ఱంపములవంటి దంతము లాడించుచు
నిమిషీయొంటికి త్రైలోక్యము చాలక వెలుపలికిం బోవుతలంపునం బోలెఁ జలించుచు మా
వటీండ్ర గిరిస్మశానోచితంబు లగునుపచారంబులు సేయఁ దదానంద మనుభవించు
చు సమరవిజయంబుల లెక్కవ్రాసికొనినకొఁతలో యశం బ్రకాశించు సన్నసన్నని ముడు
తలుకలిగి కులశైలసముద్రద్వీపకాననసమేతం బగుబ్రహ్మాండభవనంబు కవాటంబువ
ఱుం దగుల్పఁగడియుయువం దగుశుండాదండముం బ్రతిగజంబుల మదసౌరభంబు విసరిన

మై రిపుమారణంబునకువానలేని పిడుగై హస్తపాశాకర్షణంబులందు వరుణదేవునుద్దియై యరాతిపరిగ్రహంబునకు యమవాగురయై పరిణతియందుఁగాలమై తీక్ష్ణకరగ్రహణంబునకు రాహువై కుటిలగతుల కంగారకగ్రహమై మండలభ్రాంతి కలాతచక్రమై విక్రమంబునకు మనోరథసంపాదకం బగు చింతామణిపర్వతమ్మును నభిమానమ్మునకు దంతముక్తాస్తంభ విరాజమానం బగుమహారాజసౌధంబును ధైర్యంబునకు ఘంటాచామరమనోహరం బగుస్వేచ్ఛాసంచారి విమానంబును గ్రోధంబునకు మదధారాదుర్దినాంధీకృతం బగుగంధోదకధారాగృహంబును నహంకారమునకుఁ గాంచనప్రతిమాబహుళం బగు మహానికేతనంబు ననలేపనంబునకు గండశైలప్రాప్తి యగు క్రీడాపర్వతంబును దర్పంబునకు సదంతతోరణం బగు వజ్రమందిరంబును రాజ్యంబున కుచ్చకుంభకూటాట్టాలకవికటం బగు సంచారి దుర్గంబును బృథివికిఁ గృతానేక బాణవివరసహస్రంబగు లోహప్రాకారంబును భూనందనంబునకు శిలీముఖశతఝాంకారబహులం బగుపారిజాతవృక్షంబును గర్ణతాలతాండవంబులకు సంగీతగృహమును మధుపమండలమ్మునకుఁ బానమంటపంబును శృంగారాభరణంబుల కంతఃపురంబును మదలీలాలాస్యంబులకు మదనోత్సవంబును నక్షత్రమాలామండలంబులకుఁ బ్రదోషంబును మదమహానదీప్రవాహంబుల కకాలవర్షాకాలంబును సప్తచ్ఛదపవనపరిమళంబుల కసత్యశరత్కాలంబును శీకరనీహారంబుల కపూర్వహిమాగమంబును గర్జితాడంబరములకు మిథ్యాజలధరంబు నై ప్రకాశించు దర్పశతం బను నామహాగజంబుం జూచెను.

పిదప నీబాణభట్టారకుఁడు చిత్తమందిగజేంద్రమును నిర్మించుటకై పర్వతములే పరమాణువులై యుండనోపు. లేనిచో నింతగౌరవ మేలకలుగు ననునాశ్చర్యము పొడమి విభ్రాంతుఁడైయుండ దౌవారికుం డిట్లనియె.

ఉ. ఏమియు లేకయుండ నశియించిన సంపద పెంపు లోపలం
బ్రామినచింత చేతఁ బలుమాఱుఁ దలంచుచు నేచుచు న్వనీ
భూములలోఁ జరించు రిపుభూపతులెల్ల స్మరించు నీగజ
స్వామి దిశాగజేంద్రములసైతము సైఁపదు నూతనంబునన్.

తాము దయచేయుఁడు మరల నీదర్పశతముం జూడవచ్చును. ప్రకృతకాలంబున మహారాజుం జూడవలయు ననవుడు నమ్మేఖలకునితోఁ గూడ మదజలకజ్జలంబుచే నల్లనైన దంతీంద్రుని గండపట్టంబునం బడుటఁజేసి మదించినట్లయిన ముకుళితంబగు తనదృష్టిం గూడ మరలించి యతండొక మార్గముపదేశింపఁ జెక్కుమంది సామంతనృపాలకులచే నిండియున్న మూఁడుకక్ష్యలుదాఁటి నాల్గవదానియందలి యాస్థానమంటపంబు

న కెదుటి ముంగిటియందు మంచివ్యాయామము సేయుటచే గట్టిపడిన కర్ణికారగౌరం బగు పొడుగుపాటి శరీరంబులును గేలం గత్తులును గలిగి బంగారుకంబములవలె బారులు గట్టి నిలువంబడిన తాతతండ్రులతరము నాటనుండియుం గొలువుసేయు శరీరపరిచారకులు కొంచెము దూరమందుం జుట్టుం బరివేష్టింప మఱియు విశిష్టేష్టలోకంబు దగ్గఱం బరివేష్టింప మంచువలెం జల్లనై మంచిగంధపునీటం గడుగంబడి చంద్రమయమో యన ముత్తెపుంగొండరాతిపలకో యనం దనరారు దంతపాండురపాదం బగుశయనంబునం బర్యంతవిన్యస్తం బగుబుజంబుమీంద నే బరువంతయు వేయునట్లు కూర్చుండి భూషణమణిమయూఖంబులతోం గలసిన దిగంతవ్యాపి యగుదేహప్రభయందు లేందామరతూళ్లచే నిండిన వేసంగినాటి కొలకునం దోలలాడుచున్న ట్లున్న రాజలోకంబుతో ముచ్చటలాడుకొనుచుం దేవలతేజోమయంబు లగుపరమాణువులచే సృజింపంబడెనో యనునంతటి తేజశ్శాలియై సర్వావయవంబులందును నుచితంబు లగుసర్వలక్షణంబులు గలశరీరంబు మహారాజలక్ష్మిచేం గౌంగిలింపంబడి యున్నను బ్రహ్మచర్యవ్రతంబు విడువనివానివలె నగపించుచు రాజర్షివలెం బ్రతిపన్నాసిధారాధారణవ్రతుండును నవిసంవాదియునై విషమం బగురాజనీతిమార్గంబునం బదంబులు తొట్రిలునో యనుభీతిచేతం బోలె ధర్మదండ మవలంబించుచు సర్వభూపాలకపరిత్యక్తమై దిక్కుమాలి శరణుచెందిన దాసివలెన త్యపవిం గాపాడుచుం గాలిగోరులందుం బ్రతిఫలించిన చామరగ్రాహిణు లగువారవిలాసినుల ప్రతియాతన లనునెపంబున దశదిశావనితలచే సేవ్యమానండై దిక్పాలకుల కృతాకృతములు పరీక్షింపనో యన నఖాంగపాతముల కొనలందు దీర్ఘతరంబులుగాం బ్రసరింపంజేయుచు మణిపాదపీఠంబునకు వెనుకతట్టునం బ్రసరించిన దినకరునికరంబు లుపరిగమనంబునకై సెలవు గోరుకొనులాగు వహింప నలుదెసలకుం బ్రసరించిన భూషణమణిమయూఖచ్ఛటప్రదక్షిణము సేయు దివసలక్ష్మివలెం గాన్పింప మెయినిండం బూయంబడిన మంచిగంధపుంబూంత శరీరలావణ్యాంభోధిమీంది మరుంగువలె భాసిల్ల మహారాజశిరోమణిప్రతిబింబితమ్ము లగునిజాకృతులం గనుంగొని సహింపని రాజ్యలక్ష్మి విడుచు నిట్టూర్పో యన నిరుగడలం జామరానిలంబులు ప్రసరింప నాలుగుసముద్రములయందలి లావణ్యమంతయు సంగ్రహించి వచ్చినలక్ష్మిదేవతచేం గౌంగిలింపంబడెనో యన్నట్లు విరాజిల్లుచు నైకవిధంబు లగునిజాభరణప్రభలవలన నలుదెసలం దెక్కు వేల్పువిండ్లు సృజించుచు రాజులతో సంభాషించునెడలం బరిత్యజించినను మార్దవమాధుర్యాదిగుణంబులు కవికథాలాపములందు వర్షించుచు విస్రంభభాషణంబులయందు నైతము వాచామృతము వెలిపుచ్చుచు ననుగ్రహించునెడల భృత్యుల నగాధమగు హృదయముంగూడ

ముఖంబుల నపూర్వవచనసందోహదయోద్వేల క్షీరోదధిప్లావితంబులుగాఁ జేయుపయ
స్స్నిగ్ధం బగుచక్షుర్ధారావశ్యంబును బ్రతిఫలించిన చామరగ్రాహిణియందు వదననివాసి
నియగుసరస్వతీదేవి యనుశంక పుట్టించు విమలంబు లగుచెక్కుటద్దంబులును సరస్వతి
యందలి కోపంబునం గుటిల యగువదనలక్ష్మిని బతిమాలుకొనువేళఁ దగల్కొనిన తదీ
యపాదలాక్షారసమో యన్నట్లు లలాటతటం బరుణపఱచుచూడామణికాంతియు నం
శుసంతానం బనుతంత్రీవలయంబులు గలకుండలంబులను చిన్నివీణియలను స్వరవివేచ
నాపూర్వకంబున శ్రుతి చేసి పాడుగాయకులో యనఁదగు రణద్భృంగసంతతిచే వనో
హరంబు లగునవతంసకుసుమంబులచే నలంకృతంబు లగుకర్ణంబులును రాజ్యలక్ష్మీకచ
గ్రహణములయందుం దగిలిన నఖచంద్రికామండలమో లేక ముఖచంద్రునిం జుట్టవా
రిన పరివేషమండలమో యనఁగగు మాలతీకుసుమమాలికావలయంబులచేఁ గైసేయఁబడిన
కేశబంధంబును నభిషేకార్థమై స్వయముగాఁ జనుదెంచిన ప్రయాగత్రివేణీప్రవాహ
మో యనఁదగు మహానీలమరకతముక్తాఫలచ్ఛాయలచేఁ బరివేష్టితం బగుశిఖండాభరణం
బును మహాగా జితెండే యని చెప్పకయే చెప్పుచుండ సకలరాజ్యతంత్రంబులు పరిశీలిం
చుచుఁ బలుమాఱు ప్రార్థించుచు ననుగ్రహింపుఁ డనినటుల పాదములపైఁ బడుటవల
నఁ గలిగినశ్యామికయో యన్నట్లు చెమ్మటచేఁ గరఁగిన కృష్ణాగురుపంకతిలకంబువలనఁ
గలిగినవలుఁపు లలాటములయందు వ్యాపింప క్షుభితంబు లగుమనంబులనుండి పొడమిన
యుత్కలికలో యన హారంబు లురంబునం జలింప నీసుచే సిరిని భయపెట్టుచున్నవో య
న్నట్లు వికటంబు లగుభ్రుకుటీపల్లవంబులును రహింప విటజనాకర్షణంబునకై తగిల్చిన
పాశంబులో యన నవిరళపరిమళమిళితంబు లగుదీర్ఘనిశ్వాసంబులు సంభవింప మొగం
బులందుఁ బెద్దపొగడపూవుదండలు గట్టిన స్తనకలశంబులు విటజనులకుంగల స్వ
దారానురాగముఁ బెల్లగింపఁ గుచోత్కంఠికచే నట్టిట్టు కదలు హారమణికాంతులు
కాముకజనహృదయాకర్షణంబునకై వైచిన పగ్గములో యనఁ బ్రసరింపఁ బెక్కుచేతుల
చేఁ గౌఁగిలించుకొనుచున్నట్లు భూషణమణిప్రభలు ప్రకాశింప రభసాకృష్టంబు లగు
మానసంబుల నిరోధించుచున్నట్లావలించువేళ సుందరవదనారవిందములకుఁ బ్రాకార
ములుగాఁజేయఁబడిన యుత్తానకరవలయాకరణంబులు రాణింప చక్కెరవింటివానిపూ
వుటంపదెబ్బలయలసటచే మూసికొనిపోయినట్లు కర్ణోత్పలంబులమీఁది మదాంధంబు
లగుగండుతుమ్మెదలు చిమ్ము పుప్పొడి కొలుకులందుఁ బడుటవలన విలోచంబులు ముకు
ళింప నన్యోన్యమాత్సర్యంబునం గుటిలకుటిలంబులుగా వెడలిన కటాక్షంబులు కర్ణేందీవర
ములం దాడించుచున్నట్లు ప్రవహింప ననిమిత్తంబు లగుచిఱునవ్వులు మదనసాహాయ్య

కంబువకుం బోలెఁ జంద్రోదయంబుల నూజింప నెదుటనుండి సౌభాగ్యలోభంబు ప్రక టించు వారకాంతల నించుకంత కన్నెత్తి చూచుచు స్పర్శసుఖంబునం జెమ్మటవాఱిన చేతులచే గళితగళితంబుగాఁ గాళ్ళపిసుకు చరణగ్రాహిణి నెత్తిపై స్మితపూర్వకంబు గా మొట్టుచు ధనంబులు స్నేహశూన్యం బనియు దోషంబు లనాశ్రయణీయం బని యు నింద్రియంబులు నిగ్రహరుచి యనియుఁ గలి చేరఁదగినవాఁడు కాఁ డనియు వ్య సనంబులు నీరసం బనియు నపయశము భీరు వనియు మదనుండు దుర్గ్రాహచిత్తవృత్తి యనియు సరస్వతి స్త్రీలోలుం డనియు బరభార్యలు శఠుం డనియు ఋతులు కాష్ఠాము ని యనియు వేశ్యలు ధూర్తుం డనియు స్నేహితులు చనపరి యనియు బ్రాహ్మణులు కర్మిష్ఠుం డనియు శాత్రవులు సుసహాయుం డనియు నిట్లు పెక్కుమంది బహువిధంబు లఁ దలపోయ శంతనునికంటెను వాహినీపతి యనియు భీష్మునికంటెను జితకాశియని యు ద్రోణాచార్యునికంటెను ధానుష్కుం డనియు దుర్యోధనునికంటె నమోఘమా ర్గుం డనియుఁ గర్ణునికంటెను మిత్రప్రియుం డనియు యుధిష్ఠిరునికంటెను బహుక్ష ముం డనియు భీమునికన్నను బలవంతుం డనియు ధనంజయునికన్నను మహాభారతరణ యోగ్యుం డనియుఁ గవులు నిజగుణంబు వర్ణింపఁ గృతయుగంబునకుఁ గారణమై వి బుధమార్గంబునకుఁ బీజమై దర్పంబున కుత్పత్తిద్వీపమై కరుణకు నివాసమై పరాక్ర మమునకు ఖనిపర్వతమై సరస్వతికి సర్వవిద్యాసంగీతగృహంబై లక్ష్మీసముత్పత్తికి ద్వితీ యామృతమథనగృహంబై వైదగ్ధ్యంబునకు బలదర్శనమై సర్వస్థితులకేకాగారమై కాం తికి సర్వస్వాగారమై రూపపరమాణుమార్గంబున కపవర్గమై రాజ్యంబునకు సకలదు ర్చరితప్రాయశ్చిత్తంబై కందర్పునకు సర్వబలసందోహావస్కందంబై పురందరదర్పంబు న కుపాయంబై ధర్మంబున కాపత్త్రాణంబై సర్వకళలకుఁ గన్యాంతఃపురమై సౌభాగ్యం బునకుఁ బరమప్రాణమై సర్వప్రజాసృష్టులకు రాజసృష్టియాగావభృథస్నానదివసంబై గాంభీర్యమ్మును బ్రసాదంబును భయజనకత్వంబును రామణీయకమును గౌతుకాధా యకత్వంబును బుణ్యంబును మొదలగు సర్వసద్గుణవారమ్మున కగారమై యున్న హ ర్షచక్రవర్తిం గాంచెను.

చూచి యనుగ్రహీతునివలె నిగ్రహీతునిపోల్కిఁ గోరికగోరువానిరీతిఁ దృప్తిఁ జెందినవానివడువున మేనుగము పులకరింపఁ గందోయినుండి యానందబిందువులు జాఱ వి స్మయస్మేరుండై దూరంబునందుండియే యిట్లు తలపోసె. సుజన్మయుఁ బేరుచెందిన వాఁడును దేజోరాశియు జతురుదధికేదారకుటుంబియు బ్రహ్మస్తంభఫలభోక్తయు న గు హర్షచక్రవర్తి యితఁడే కాఁబోలు! యీమహామహునివలననే భూమి రాజన్వతి

దవు. లోకులు స్వేచ్ఛాప్రవృత్తి కలవారు. లోకప్రవాదలు చిత్రవిచిత్రములైనవి. మహాత్ములవి వినినంతమాత్రమున దొందరపడఁగూడదు. యథార్థముఁ గనుఁగొనవలయు. తమరానతిచ్చినయట్లు నన్ను శిష్టేతరునిఁగాఁ దలఁపఁగూడదు. బ్రాహ్మణుండ నదియునుంగాక సోమపాయు లగువాత్స్యాయనులవంశమందుఁ బుట్టినవాఁడ. యథావిధిగ నుపనయనాదిసంస్కారములచే సంస్కరింపఁబడితి. అదియునుంగాక వేదము సాంగముగాఁ జదివితి యథాశక్తి శాస్త్రము లన్నియుఁ బరిశీలించితి దారపరిగ్రహంబున గృహస్థుండనైతి. యథాశక్తి నతిథుల నభ్యాగతులఁ బూజించుచుంటి. *"కామేభుజంగతా" చిన్నతనంబున నిహపరంబులకుఁ జెడని చపలకార్యంబు లేవేనిఁ జేసియుండును. అంతమాత్రమున నిట్లనఁదగుదునా? ఇట్టిబాల్యచాపల్య మెవ్వరియందులేదు. తమరానతిచ్చినమాటచే నాహృదయము పరితపించుచున్నది, నేను బశ్చాత్తాపపడుచుంటిని. ఈకాలంబున బుద్ధదేవునివలె శాంతస్వభావుండవై మనువుపోలిక వర్ణాశ్రమవ్యవస్థసేయుచు సమవర్తివలె దండధారివైన దేవర సమస్తద్వీపములతోఁ గూడినసప్తసముద్రముద్రితమైన భూమిఁ బరిపాలించుచుండ సర్వవ్యసనములకుఁ గారణమగు నవినయ మెవ్వఁడును నిశ్శంకముగామనములోనైనఁ దలఁచుటకు సమర్థుఁడు కాఁడు. ఇఁకఁ జేయుటకెట్లుసమర్థుఁడు. మనుష్యులై జన్మించినవారల నటుండనిమ్ము. నీప్రభావంబునకు జడియుచు జడియుచుఁ దుమ్మెదలు గూడ మధుపానము సేయుచున్నవి. చక్రవాకపక్షులుగూడ నధికవ్యసనంబువలన సిగ్గుపడుచు ప్రియాసంయోగ మనుభవించుచున్నవి. కోఁతులుగూడఁ జకితములై చాపల్యముఁ బూనుచున్నవి. ఘాతుకంబు లగుశ్వాపదగణంబులుగూడ జంతువులపైఁ గరుణఁ జూపుచు మాంసమునుఁ దినుచున్నవి. వెయ్యేల! కొంతకాలమునకు దేవరకు నాయోగ్యత తెలియకమానదు. ప్రజ్ఞావంతుల ప్రకృతులు తప్పుదారిని నడచు చిత్తవృత్తినిఁగూడ మరలించుకోఁగలవు. అని పలికి యూరకుండెను.

హర్షభూపాలుండును మే మట్లు వింటిమి. అనిపలికి యూరకుండెను. కాని కూర్చుండు మని యాసనమిచ్చుట సంభాషించుట మొదలగుసత్కారములచే ననుగ్రహింపఁడయ్యె. అమృతమును వర్షించు స్నేహగర్భం బగుచూపు నిగిడించి మదిలోఁ గించిత్ప్రీతి యున్నట్లు మాత్ర మగుపఱచెను. ప్రభాకరుం డస్తమయముఁ గోరి చరమగిరిమీఁదికి వ్రేలాడుచుండుటఁ జూచి పరిచరుల నందఱిని విసర్జించి రాజలోకమునకు సెలవిచ్చి యంతఃపురమునకుం బోయె. బాణుండును నాస్థానంబువిడిచినగరటఁ దల్ల

* కా - మే - భుజంగతా - నాయందు పలిభుజంగత్వమేది? కామేభుజంగతా = భుజంగత్వము మన్మథునియందుఁగలదు. కా - మే - భుజం - గతా? నాభుజమును బొందినస్త్రీ యెవ్వతె?

గాఁ బోసినయిత్తడిరేకువంటి వాసరచ్ఛాయ చల్లాఱుచుండె, మరీచిమాలి యస్తాద్రికూటకిరీటంబుపై నీటిప్రబ్బపూవుగుత్తులవంటి కిరణంబులు ప్రసరింపఁజేయుచుండె. అరణ్యస్థలంబులయందలి భూతపూర్వగోస్థానంబులకు నెమరువేయుచు-లేడిగుంపులు చేరుచుండె. తరంగిణీతటంబులు శోకాములకోకకుటుంబినీకూజితదీనంబులగుచుండె. పిచ్చుకలు కిచకిచఁగూయుచు నివాసవిటపంబులకుఁ జేరుచుండె. గృహారామవృక్షంబులు నిండార నీళ్ళునిండిన బోదులతోఁ బ్రకాశించుచుండె. పగలంతయుఁ దిరిగి పాలుచేఁపు పొదుగులతో వచ్చిన ధేనువులపాలు లేఁగదూడలు దుముకుదుముకునఁ గుడుచుకొనుచుండె. క్రమక్రమముగా నస్తాద్రిమీఁది గైరికధాతుధునీప్రవాహంబులో మునిఁగినవాఁడుం బోలె నెఱ్ఱనికాంతితోఁ బతంగుండును సంధ్యాసింధుపానపాత్రంబున మునిఁగె. పారాశరులు కమండలుజలంబులం గాళ్ళుసేతులు గడుగుకొని చైత్యంబులకు నమస్కరింపసాగిరి. స్రుక్స్రువంబులు కరంబులం ధరించి చుట్టును దర్భలచే నలంకృతంబులై మండుచున్న యగ్నులందు యాయజూకులు వషట్కారపూర్వకంబుగా హవ్యంబులు వేల్వఁదొడఁగిరి. మాలకాకులు కలకలలాడుచుఁ గులాయంబులకుఁ జేరఁజొచ్చె. ఆరామవృక్షంబులు కాపేయవికలంబుగఁ దోఁకలు కొమ్మలకుం జుట్టి వ్రేలాడు కోఁతులచే నిండెను. గుడ్లగూబలు ముసలిచెట్లతొఱ్ఱలనుండి వెడలసాగెను. మునీశ్వరులిడుసంధ్యావందనార్ఘ్యప్రదానజలబిందువులో యనఁ బెద్దపెద్దచుక్కలగుంపు తారాపథము నలంకరించె. రాత్రి యనుచెంచుగుబ్బెతకేశపాశమో యనఁ గంఠేకాలకంఠకాలం బగు బాలాంధకారం బవశిష్టసంధ్యారాగముం గబళించె. చీఁకటిని భయపెట్టుటకై యగ్నినుండి వెడలిన దినకరకిరణపరంపరయో యన దీపములు ప్రకాశించె. పురద్వారంబులు కవాటావరోధనంబునం బుట్టినచప్పుళ్ళచే నావృత్తి చెప్పఁదొడఁగె. పిల్లలు ప్రక్కలమీఁదికిఁ జేరి ముసలమ్మలుచెప్పు కథలు వినుచునిద్రింపఁ దొడఁగిరి. క్రమంబుగ భీషణదమంబగు తమంబు ముసలిబఱ్ఱెమేనికాంతివంటి కాంతితో దెసలు నిండె. ప్రణ్యాజనప్రచారంబు మెండయ్యె. సర్వసంసారసమృద్ధికారకుం డగుమకరధ్వజుండు పూవిల్లుటాంకరించుచు శరనికరంబు వర్షింపఁ దొడంగె. వేశ్యాజనము దూతికలమాటలాలించినపిదప రతారంభంబులకై శరీరమ్ము లలంకరించుకొనఁ జొచ్చె. అత్తింటికోడండ్రు జఘనస్థలంబులందు సైరంధ్రీజనము మోఁతమ్రోగు మొలనూళ్ళలంకరింపఁజొచ్చెను. అభిసారికాజనము మదనుఁడు మాత్రము వెంటరా జనశూన్యము లగువీథులవెంబడి నడువఁదొడంగెను. అల్పసరళ్ళాయిను లగువరటల యందెలమ్రోతవంటి మంజులధ్వని విరళం బయ్యె. నిద్రాళసంబు లగుసారసపక్షుల పెద్దకూఁతలు విరహిజనహృద

యంబులం గరఁగింపఁ గోడంగె. వానరవృక్షంబు మరలఁ బుట్టించుటకై దాఁచిన విత్తనములో యన నింటింట దీపనికరంబు కరంబు శోభిల్లె. అట్టిసమయంబున రాజాస్థానంబు వెడలిన బాణుండును నిజనివాసంబునకుం జనుదెంచి తనచిత్తంబున నిట్లు తలపోసె. హర్షచక్రవర్తి మిగుల దాక్షిణ్యశాలి, యనేకంబు లగునా బాల్యచాపల్యంబులును దత్కాలిక లోకాపవాదంబులును విని కోపించినను నాయందు స్నిగ్ధం బగుదృష్టియే నిగిడించె, నేను ప్రస్తుతకాలంబున మరల దర్శనము చేసినను నన్ననుగ్రహింపఁడు. కాలక్రమంబున నన్ను గుణవంతునిగాఁ దెలిసికొనఁగలఁడు. ప్రభువు లొకప్పుడు భర్తృవ్యలకీరీతివినయ ముపదేశించుచుందురు. కాని స్వదోషమలీమసుండనై యనాదరపీడితుండనైన నాజన్మమునుమాత్రము నేను నిందించుకొనవలసినదే. అతిగుణవంతుం డగురాజు నాయందిట్టిదోషంబు భావించుట నాదురదృష్టము కద. కానిమ్ము, నాయథార్థస్థితి రాజెట్లెఱుంగునో యట్లు తగినవ్యాపారంబునం బ్రవర్తించెద. కొంతకాల మరిగినపిదప యతనికే తెలియఁగలదు. అని నిశ్చయించుకొని కటకంబు వెడలి స్నేహితులయు బాంధవులయు గృహంబులయందు పృథివీపతి తన్ను స్వయముగఁ బిలిపించి యనుగ్రహించినందాఁక నివసించి యథార్థస్థితి నెఱింగిన హర్షచక్రవర్తిచే మరల నాహూతుండై సత్కారపూర్వకంబుగ నరపతిభవనముం జొచ్చి కొలఁదిదినంబులు పరమప్రీతుం డగుభూపాలుని యనుగ్రహము వడసి యతని ప్రేమకును విస్రంభమునకును ద్రవిణంబునకును జనువునకును బ్రభావంబునకును మిగులఁ బాత్రుండై యానంద మనుభవించెను.

ఇది బాణభట్టవిరచితం బగుహర్షచరిత్రంబున
రాజదర్శనంబను ద్వితీయోచ్ఛ్వాసము.

---

# హర్షచరిత్రము.

## తృతీయోచ్ఛ్వాసము.

గీ. భక్తజనశాలి యాత్మీయబహుళవర్ష, వర్ధితస్నేహపాళి భూపాలమాళి
మంచికాలంబుపోలిక మానవులకు; సుకృతపరిపాకమున లభించు న్నిజంబు.

గీ. సాధుజనముల కుపకృతి సలుపుకొఱకుఁ, గలిమిగైకొనుకొఱకు కాకాళగమున
మాచరించుట కేవార లాసపడరు, మంచివారల చరిత మాలించుటకును.

నీరదంబులు విరళంబు లయ్యె. చాతకంబులకు భయ ముప్పతిల్లె. కలహంసల కలకలధ్వనులు మెండయ్యె. కప్పకూఁతలు నశించె. నెమ్మిగుంపుల కుత్సాహంబు త

తిఁగె. రాయంచబాటసారులు మానసంబునుండి మరలిరి. మిన్ను తోమినకత్తి చందముగాఁ గానుపించె. వేఁడివెలుంగువెలుంగులు వెలిఁగె. చుక్కలకుం బసుచుఁదనంబు వచ్చె. చందురుఁడు శుచి యయ్యె. వేల్పురాచవిల్లు జాఱె. మెఱుపుదండలు వాఁడిపోయె. దామోదరునకు నిద్రాభంగంబు తావచ్చె. నీటికి వైదూర్యవర్ణంబు సంప్రాప్తమయ్యె. తేలికపడిన మేఘంబులు మంచువలెఁ బరుగిడసాగె. కడిమిపూవులు వికసించె. గిరిమల్లికలు కుసుమరహితంబు లయ్యె. నేలతాడిచెట్లు ముకుళపరిప్రింబు లయ్యె. తమ్మితీవల కేపునూపె. కలువపూవులనుండి మకరందము ప్రసిరింపఁదొడఁగె. రక్తోత్పలంబు లుల్లాసంబుఁ దాల్చె. నిశలు శేఫాలికాకుసుమశీతలంబు లయ్యె. యూథికలామోదంబు వహించె. దశదిశావనితలు తెల్లచీరలు ధరించిరి. సప్తచ్ఛదమాలి రేఁగె. వికసించిన మంకెనపూవుగెల్లెడల నకాలసంధ్యారాగంబు నీనఁదొడఁగె. వాయసంబుల కుల్లాసంబు ఘటిల్లె. దంతావళంబులకు మదంబు హెచ్చె. ఆఁబోతులు బలిసె. బురద యెండె. నదీతీరంబులందు లేఁతయిసుకతిన్నె లేర్పడియె. నివ్వరిచేలు పండిన యెన్నలచే నిండె. కొట్టయెన్నులనుండి పరాగము లెగసె. త్రిపుషవృక్షంబుల చెరిఖ్య గట్టె పడియె. బాణుండును నీతాదృశశరత్కాలంబున హర్షునియొద్ద సెలవు తీసికొని బాంధవులం జూచుటకై నిజగ్రామంబున కేతెంచె.

ఈతనిబంధువు లందఱును రాజానుగ్రహము వడసి వచ్చె నని సంతసించుచుఁ జూడవచ్చి కొంతవడి కొనియాడఁజొచ్చిరి. బాణుండును గొందఱికి నమస్కరించుచుఁ గొందఱిచే నమస్కరింపఁబడుచుఁ గొందఱు శిరంబు మూర్కొనఁ గొందఱ శిరంబు మూర్కొనుచుఁ గొందఱు కౌఁగిలించుకొనఁ గొందఱం గౌఁగిలించుకొనుచుఁ గొందఱు దీవింపఁ గొందఱం దీవించుచు బంధుమధ్యవర్తియై పరమసంతోషంబుతోఁ గొంతకాలంబు గడపి పరిజనానీతంబు లగుపీఁటలయందుఁ బెద్ద లందఱుఁ గూర్చున్న పిదపఁ దానును గూర్చుండి ప్రీతమానం బగుమనంబున వారినందఱిని నేఁటివఱకు సుఖులై యున్నారా యని కుశలమడిగి సర్వకార్యంబులు నిరాటంకములుగా నున్నవా యని క్షేమము తెలిసికొని యుచితసమయంబులం జేయవలసిన క్రతువులు చేయుచున్నారా యనిధర్మమురసి హుతభుక్కు యథాన్యాయంబుగ హవ్యంబుఁ గుడుచుచుండెనా యి నిపుణ్యంబుపరిశీలించి వేదాభ్యాస మవిచ్ఛిన్నముగా జరుగుచున్నదా వటువులకు విద్యాశిక్ష చక్కఁగా నున్నదా యనికులాచారంబు ప్రస్తావించి యాగవిద్యలయం దభియోగము మున్నటితెఱంగుననే యున్నదా యొకరిని మించున ట్లొకరెవ్వరేని వెన్కటిరీతి వ్యాకరణగ్రంథములకు వ్యాఖ్యానములు చేయుచున్నారా! ఇతరకార్యంబులు నైత

ముజ్జగించి తొల్లింటిచాయఁ దర్కశాస్త్రప్రసంగంబులు కావించుచున్నారా! మన్నింటిచందంబున మీమాంసయందలి యది సర్వశాస్త్రాధిక్యముం జెందుచున్నదా! అమృతవర్షము వర్షించు మనోహరవచనరచనాచమత్కారంబు గలకావ్యంబు లెప్పటియట్ల సృష్టింపఁబడుచున్నవా యని విద్యావిషయంబులు ముచ్చటించి సంతోషపఱచె.

వారును దండ్రీ! మాకేమికావలయుఁ దేశితాగ్నులు సహాయములుగా సర్వదా విద్యాగోష్ఠిచే సంతసించుచుఁ గాలముఁ గడపుచున్నాము. శేషాహిదేహసీసరం బగు శ్రీహర్షచక్రవర్తి భుజము సకలభువనంబులును బ్రోచుచుండ మాకుఁ గొదవయే లేదు దండును నీవామహారాజుసన్నిధి సన్నిహితుండవై వేత్రాసన మలంకరించి యుంటివి కదా! మేమును శక్తికొలఁది విభవమునకు మించకుండఁ గాల మతిక్రమించకుండ యథావిధి విప్రజనోచితంబు లగుక్రియలు నిర్వర్తించుకొనుచున్నారము. అనుచు నిత్యాదిసల్లాపముల చేత సంతోషపఱచుచు స్కంధావారవృత్తాంతములఁ గొంతప్రొద్దును గొంతకాలము బాల్యమునందలి చేష్టలు తలంచియుఁ గొంతతడ వతఁ డూరలేనియెడ జరగినకథలు వక్కాణించియు వినోదపెట్ట బాణుండును వారితోఁ గొంతసేపు కూర్చుండి మధ్యందిన మగుడు భోజనాదిక మాచరించెను. బంధువు లందఱును దమతమ యిండ్ల కరిగి భుజించి మరల బాణునియొద్దకిం జేరిరి.

ఇట్టుండ బట్టునూలుతో నేసిన నెమలికడకంటిచాయ గలకట్టుబట్టలు స్నానావసానకాలంబుననే నమస్కరించి కైకొన్న తీర్థమృత్తులోఁ గోరోచనంబు కలపి నెలకొల్పిన తిలకంబును శైలాములకంబుచే నునుపుచేసిన తలవెండ్రుకలును జుట్టుముడిపై దట్టంబుగాఁ జుట్టిన పువ్వుదండలును బెక్కుసార్లు నమలిన తాంబూలంబుచే నెఱ్ఱగారపట్టిన పెనవులును నేత్రాంతంబులం దేకశలాకచే దిద్దిన కాటుకరేకయు వివస్త్రంబును బూజ్యం బగువేషంబును గల సుదృష్టియను పేరుగల పుస్తకవాచకుఁడు చనుదెంచి తేనియ లప్పుడే భుజించినట్లు తెలుప నాతిదూరంబునం దున్నయొకతిన్నెపైఁ గూర్చుండి ముహూర్తకాలము గడచినపిదపఁ బైఁ జుట్టఁబెట్టిన దారమప్పుడే విప్పినను నఖకాంతులచే మృణాళమృదులంబు లగుసూత్రంబులు చుట్టఁబెట్టినట్లున్న పుస్తకము రెల్లుకట్టలచే నేర్పఱచిన వ్యాసపీఠంబుపైఁ బెట్టి మధుకరపారావతులకుం గూర్చుండుటకుఁ దగినతావిచ్చి ప్రొద్దుటఁ గొంతప్రొద్దు చదివి యాఁగినచోటు తెలియుటకై గుర్తించిన గురుతెఱచి తదంతరపత్రంబు పైకిం దీసి పట్టుకొని మషీమలినంబు లగునక్షరంబులు దంతకాంతులచేఁ బూజించుచున్నట్లు ముఖసన్నిహితసరస్వతీనూపురారావ

ములం బోలు గమకంబు లగు మధురస్వరంబులతో రాగయుక్తంబుగా సకలజనులహృదయంబు లాకర్షించుచు వాయుప్రోక్తంబగు పురాణములఁ జదువఁదొడంగెను.

చెవులకింపగు సంగీతముతో నతం డిట్లు పురాణముం జదువుచుండఁగా నాతిదూరవర్తియగు సూచీబాణుఁ డనువంది తారమధురం బగుస్వరంబుతో నీరెండుపద్యములను జదివెను.

క. మునిగీత మతిమృదువు పా, వనము జగద్వ్యాపి విపులపదమును నగునీ
ఘనచరితము నాశా వా, ష్ణవిఘనచరితం బటంచు సూషింపనగున్.

గీ. వంశసంక్రామితం బవివాదిభరత, మార్గసంచారి శ్రీకంఠసర్గితంబు
ప్రాపితస్ఫుటకరణంబు హర్షరాజ్య, భారముం బోలుచున్న దమూరె గీతి.

పితామహాముఖపద్మంబుల వలె వేదాభ్యాసపవిత్రమూర్తులును సుపాయంబుల పోలిక సామప్రయోగలలితవాక్కులు నగుగణపతియు నధిపతియుఁ దారాపతియు శ్యామలుండు నను బాణునిపినతండ్రికుమారులు ప్రసన్నవృత్తులు వాక్యవేత్తలు కృతగురుపదన్యాసులు న్యాయవాదులు సుకృతసంగ్రహాభ్యాసగురువులు లోకమునందుం బోలె వ్యాకరణమునందును సాధుశబ్దము లెఱిఁగినవారు సకలపురాణరాజర్షిచరిత్రంబులు తెలిసినవారు మహాభారతభావితాంతఃకరణులు విదితసకలేతిహాసులు మహావిద్వాంసులు మహాకవులు మహాపురుషవృత్తాంతములు వినఁగోరినవారు సుభాషితశ్రవణరసరసాయనులు నిరాశులు, యశస్సునందును దపస్సునందును సదస్సునందును మహస్సునందును శరీరమునందును యజుర్వేదంబునందును బ్రథమగణ్యులు వక్తలు నల్వురును స్మితసుధాధవళితకపోలోదరులై యొండొరుల మొగములం జూచుకొనిరి.

వారిలోఁ జిన్నతండు కమలదళనీలవిశాలలోచనుండు శ్యామలుండు బాణునకుఁ బ్రాణంబులకంటెఁ బరమప్రియుండు తక్కినమువ్వురును సన్నయిడనమస్కరించి దశనకాంతిచంద్రికలు నలుదెసలకుం బ్రసరింప నిట్లనియె. తాతా! బాణభట్టారక! ద్విజరాజు గురుదారం గవిసె. పురూరవుండు బ్రాహ్మణవిత్తంబున కాశించి ప్రియకారి యగునాయువునకుం జెడియె. నహుషుండు పరకళత్రమున కాసపడి కొండచిలువై పోయె. యయాతి విప్రకన్యం బెండ్లియాడి పాపాత్ముండయ్యె. సుద్యుమ్నుండాఁడురూపుఁ దాల్చె. సోమకుండు జంతుహింసయందు నిర్దయుం డనుమాట జగద్విదితమే కదా! మాంధాత సంగరవ్యసనంబునం బడి పుత్రపౌత్రాదులతో నశించె. పురుకుత్సుండు తపస్సు చేయుచుండియు మేఖలకన్యకయందుఁ గుత్సితకర్మం బాచరించె. కువలయాశ్వుండు పాతాళలోకంబునకరిగి యశ్వతరకన్యకను గూడ వసలఁజాలకపోయె.

పురుషాగ్రగణ్యుండయ్యుఁ బృథుచక్రవర్తి పృథివిని బరిభవించెను. సగరమహారాజున కూనరవెల్లియగుటయు వర్ణసాంకర్యంబును దటస్థించె. సౌదాసుండు పృథివి చక్కఁగాఁ బరిపాలింపక చింతలవంతల కావించె. నలుండతుహృదయము వశముగావించుకొనలేక కలిచేఁ బరిభూతుండయ్యె. సంవరణుండు మిత్రకన్యకయం దనురాగపడియె. దశరథుం డిష్టరామప్రవాసంబున మృత్యువుపాలయ్యె. కార్తవీర్యుండు గోబ్రాహ్మణాపకారంబునం బంచత్వముఁ జెందె. మరుత్తుం డిష్టబహుసువర్ణుండయ్యు దేవతాద్విజవిరోధి యయ్యె. శంతనుండును వ్యసనంబున వాహినీవియుక్తుండై యరణ్యమందేడ్చెను. పాండుండు మత్స్యముపలె వనమధ్యగతిం జెంది మదనరసావేశంబునం బ్రాణత్యాగంబుఁ గావించె. యుధిష్ఠిరుండు గురుభయంబున విషణ్ణహృదయుండై సమరాంగణంబునం దసత్యమాడె. ఇప్పగిది నెవ్వరియందును నిష్కళంకం బగురాజత్వమే లేదు. దేవదేవుండును సర్వమహీభోక్తయు నగుమహాచక్రవర్తికి మాత్రమే కళంకమును లేదు. ఈచక్రవర్తి కద్భుతంబు లగుచరిత్రంబులు పెక్కులు కలవు. బలజేత యగునితండు కృతపక్షం బగుక్షితిభృత్తతి చలనంబుఁ బాపె. ప్రజాపతి యగునీభూపరుండు శేషభోగిమండలముమీఁద క్షమ మోపె. పురుషోత్తముఁడైనయీనరపతి సింధురాజును మథించి లక్ష్మిం గైవసము చేసికొనియె. బలియగు నీధరాపతి మోచితభూభృద్వేష్టనం బగుమహానాగంబును వదలె. మహాదేవుం డగునీచక్రవర్తి కుమారు నభిషిక్తుం జేసెను. స్వామి యగునితం డేకప్రహారపాతితారాతి యగుశక్తి ప్రకటించె. నరసింహుం డగునీయన స్వహస్తమర్దితారాతి యగువిక్రమంబుం గన్పఱచె. ఈపరమేశ్వరుండు తుషారశైలభూకరగ్రహంబు కావించె. ఈలోకపాలకుండు దిగంతములయందు లోకపాలకుల నియమించె. మఱియు భువనకోశం బంతయు నగ్రజన్ములకుఁ బంచిపెట్టె. ఏతాదృశంబు లగుమహాసంరంభంబులు ప్రథమకృతయుగంబునందుం బోలె నీయనఘుని కాలమందును గలవు. కావునఁ బుణ్యశ్లోకుండును సుప్రసిద్ధనాముండు నగునీమహాచక్రవర్తిచరితము కూటస్థపురుషాదికంబుగా వినఁగోరుచున్నాము. మేము చిరకాలమునుండి మీశుశ్రూష చేయుచున్నాము. అయస్కాంతమణులు నీరసంబులును నిష్ఠురంబులు నగునినుపమేకుల నాకర్షించినట్లు మహాత్ములగుణంబులు క్షుద్రులమనంబులను గూడ నాకర్షింపఁగల వన్నచో సహజసరసంబులును మార్దవబహుళంబులు నగుమనంబుల నాకర్షింపఁగల వని వేఱె వాక్రువ్వనేల. ద్వితీయమహాభారత మనిపించుకొను నీభూపరుని చరిత్రమునం దెవ్వరికిఁ గుతూహలము కలుగదు! శుచి యగుమనభార్గవవంశ

ము పుణ్యశ్లోకుం డగు నీరాజర్షి చరిత్రము వినుటవలన మఱింత కుతూహలం బగుం గాత. తమ రాత్రి యగువలయు నని యూరకుండెను.

బాణుండును విని చిఱునగవు నగి, ఆర్యా! యుక్తియుక్తంబుగఁ బలుకవైతివి. మీకుతూహలమ్ములును మనోరథంబును ఫలించునవిగా నేఁ దలంపను. స్వార్థాభిలాషుల చిత్తంబులు శక్యాశక్యపరిసంఖ్య లేనివి. ప్రియగుణానురాగిణియుఁ బ్రియజనకథాశ్రవణకుతూహలయు నగుమహాత్ములచిత్తవృత్తి కేనియు వివేకము కొంత కొఱంత యగుఁ గాని కాకపోదు. చూడుము. అల్పపరమాణుపరిమితం బగు నామతి యేడ బ్రహ్మస్తంబపర్యంతవ్యాపిని యగుహర్షచరిత్రకథ యేడ. కతిపయవర్ణఘటితంబు లగుశబ్దంబు లెక్కడ సంఖ్యాతీతంబు లగునతనిగుణంబు లెక్కడ. ఈమహావిషయము సర్వజ్ఞుని కేని యవిషయంబు వాచస్పతి కేనియు నగోచరంబు సరస్వతి కేనియు నతిభారంబు మావంటివారిమాట తలంప నేల. నూఱురెట్లు పురుషాయుషము పట్టినను సంపూర్ణముగ నీమహారాజు గుణములు వర్ణింపఁ జాలఁడు. తదేకదేశము మాత్రము మీకు వినఁ గుతూహలమేని యేము సిద్ధముగా నున్నాము. నాలుగక్కరములు నేర్చినవానాలుకయు సార్థకముఁ గావించుకొందును. వినువారు మీరు హర్షచరిత్ర వినిపించునది యింకేమి కావలయు; నేఁడు ప్రొద్దు గ్రుంకవచ్చినది. లంబమానకపిలకిరణుం డగుసూర్యభగవానుడు కపిలజటాజూటపరివేష్టితుం డగుభార్గవరాముండు రుధిరహ్రదంబున మునింగినట్లు సంధ్యారాగంబున మునుంగుచున్నాఁడు. ఱేపట మరలఁ గలసికొంద మనవుడు నందఱును నట్లే యనిరి బాణుండును బరమసంధ్య నుపాసించుటకై శోణనదతీరంబునకుఁ జనియె. పిదపఁ గ్రమంబుగా మధుమదమత్త యగుమాళవాంగన కపోలమువంటి యారెండయు నశింపఁ దమ్మితీవ కుపద్రవంబు రాఁబోవుచున్న దనుకోపంబుం బోలె నెఱ్ఱవడిన రవియు నస్తమించె. రవితురంగంబులవలని భయము తీఱెనని విచ్చలవిడిగా బయవెత్తుమనుమహిషంబువలెఁ దమంబు నభంబున వ్యాపించె. తాపసు లింటిచూరుల కాఁగట్టిన వల్కలంబులు విప్పి దాఁచుకొనిరి. కలికాలకల్మషముం బాపఁజాలినయగ్నిహోత్రధూమంబు గగనంబునం దలముకొనియె. యజమానులు మౌనవ్రతనియమము వలంబించిరి. సోమిదమ్మలు విహారవేళాపరిజ్ఞానంబునకై యిట్టటుఁ దిరుగ సాగిరి. పచ్చగడ్డిమోపులు విప్పి ముందువైచి హోమధేనువులపాలు పితుకఁ జొచ్చిరి. యాగవహ్ని ప్రజ్వలింపఁదొడంగె. బ్రహ్మచారులు కృష్ణాజనంబులు పఱచినకుశవిష్టరమ్ములపైఁ గూర్చుండి జపము లారంభించిరి. ఇట్టిసమయంబున బాణుండును భుజించి బంధువులం గలసికొని యొక్కయామముపర్యంత మిష్టగోష్ఠితోఁ గాలముఁ గడపి గణప

తియింటఁ బరికల్పితం బగుశయనీయంబున శయనించెను. తక్కినవా రందఱు లోచనంబులును గమలదళంబులవలె ముకుళించినను సూర్యోదయము నభిలషించుచుండఁ గుతూహలంబున నారాత్రి యతికష్టంబునఁ గడచె.

ఆరాత్రి చతుర్థయామంబున మేల్కాంచిన వంది యీ రెండుపద్యములను జదివెను.

చ. వెనుకకుఁ గాళ్లు సాఁచి మెయి పెంచి త్రికంబుఁ గుదించి ముట్టె జా
మ్మునఁ గదియించి బూడిదను బ్రింగిన జాలు విదల్చి ఘాసముం
దినునభిలాషచే మొగము ద్రిప్పుచుఁ దాసకిలించుచుండె మే
ల్కొనినతురంగమంబు ఖురకాండములం ధరణి న్విదిర్చుచున్.

చ. మొగ మొకకొంత వంచి ముఖముం గటియొద్దకుఁ జేర్చి చంచలం
బగు హిమబిందుముక్తట రయంబు మెయిన్ముడఁగప్ప నిద్రచే
నిగనిగలాడు దేహమును నిక్కుచెవు ల్గనుపట్ట వాజి మె
ల్లఁగఁ గనుబొమ్మలం గల యలంతి బుసంబును గోఁకుచుండెడున్.

బాణుం డా రెండుపద్యములును విని నిద్రవదలి మొగము కడిగికొని సంధ్యోపాసనఁ గావించి సూర్యోదయమయిన పిదపఁ దాంబూలముం గ్రహించి చనుదెంచె. అతనిబంధువు లందఱును జనుదెంచి యతనిం జుట్టువారి కూర్చుండిరి. బాణుండును మఱల వెనుకటి పిన్నతమ్మునిచేతనే యుద్బోధితుండై హర్షచరిత్ర యిట్లు చెప్పం దొడంగె.

ఇది......శ్రీ తిరుపతి వేంకటేశ్వ రాంధ్రీకృతం బగు
హర్షచరిత్రమునందలి బాణభట్టకవిచరిత్రంబను
ప్రథమభాగము.



*

# —శ్రీ రామవిలాస గ్రంథమాలిక.—

—:o:—

## — నవలలు —

| | | |
|---|---|---|
| 1 | ప్రభాతము | రు 0—12—0 |
| 2 | వినోదిని 1 వ భాగము | రు 0—12—0 |
| 3 | వినోదిని 2 వ భాగము | రు 0—12—0 |
| 4 | ప్రేమలత | రు 0— 8—0 |
| 5 | పరుసవేది | రు 0— 8—0 |
| 6 | మయసభ | రు 0—10—0 |
| 7 | అపూర్వప్రతిభ | రు 0—10—0 |
| 8 | కాంచనమాల | రు 0— 3—0 |
| 9 | రోహిణి | రు 0— 2—0 |
| 10 | రత్నపురి | రు 0— 2—0 |
| 11 | మాయ | రు 0— 6—0 |
| 12 | చాందసుల్తాన | రు 0—10—0 |
| 13 | చినరంగరావు | రు 0— 6—0 |
| 14 | హర్షచరిత్రము (పూర్వభాగము) | రు 0— 8—0 |
| 15 | విద్యావంతుని ధర్మములు | రు 0— 2—0 |
| 16 | సంక్రాంతిసంచిక (ఆంధ్రగ్రంథాలయ వార్షికోత్సవములు.) | 1—0—0 |
| 17 | సహృదయ | రు 0—4—0 |

## —♦ ఇతర గ్రంథములు ♦—

| | | |
|---|---|---|
| 18 | బుద్ధినీతులు | రు 0—4—0 |
| 19 | శ్రీనీతిపద్యరత్నావళి | రు 0—4—0 |
| 20 | రాయలరాజనీతి | రు 0—4—0 |
| 21 | పాణిగ్రహణము | రు 0—1—0 |
| 22 | ఐరోపామహాసంగ్రామము | రు 0—2—0 |
| 23 | కురంగము | రు 0—1—0 |
| 24 | గోషా | రు 0—8—0 |
| 25 | మల్లెమొగ్గ | రు 0—1—0 |
| 26 | ఓటరులకర్తవ్యము | రు 0—2—0 |
| 27 | ఆంధ్రపరిశోధక మహామండలిచరిత్ర & ముద్రితాముద్రితగ్రంథముల పట్టిక | రు 0—8—0 |
| 28 | హితవాది (విమర్శనము) | రు 0—0—6 |

వలయువారు, కార్యదర్శి;—శ్రీరామవిలాస గ్రంథమాల,
చిత్రాడ; పిఠాపురంపోష్టు. గోదావరి జిల్లా.

## —అముద్రితాంధ్ర గ్రంథసర్వస్వము—

| | |
|---|---|
| 1. జాహ్నవీమాహాత్మ్యము (పసుపు లక్ష్మణకవి) | 0—10—0 |
| 2. సీమంతినీకళ్యాణము (పెనుమళ్ళ సోమన్నకవి) | 0—10—0 |
| 3. విజయనందనవిలాసము (మంగళగిరి ఆనందకవి) | 0—10—0 |
| 4. వాల్మీకిచరిత్రము (రఘునాథభూపాలుడు) | 0—8—0 |
| 5. రంగనాథరామాయణము (కాచభూపతి, విఠ్ఠలరాజు) | 1—0—0 |
| 6. చిత్రాడ వేంకటేశ్వరశతకము. (సంస్కృతము) | 0—2—0 |
| 7. శ్రీమదనగోపాలశతకము | 0—2—0 |
| 8. మహిజామనోహరశతకము. | 0—1—0 |
| 9. వేంకటాచలనిలయశతకము. | 0—1—0 |
| 10. జమ్మివాయశతకము. | 0—1—0 |
| 11. శ్రీరంగమాహాత్మ్యము (కట్టా వరదరాజేంద్రకవి) | 0—12—0 |
| 12. సారంగధరచరిత్రము (కూచిమంచి తిమ్మకవి) | 0—8—0 |

(7–10: ఇవి నీతిబోధకములగు శతకములు.)

వలయువారు, కార్యదర్శి;—
అముద్రితాంధ్ర గ్రంథసర్వస్వము,
చిత్రాడ; పిఠాపురంపోష్టు, గోదావరిజిల్లా